


హుమ్మ్...పాపిన్స్!

# Ram and Shyam

## Winning the De-Colouriser






























# CALL IT A MAGAZINE PLUS!




## MUCH MORE THAN A MAGAZINE FOR TINY-TOTS – TO KINDLE YOUR YOUNG ONE'S IMAGINATION




**The young and the old react thus:**

The info-park pages are very useful as they help us to know various facts about different topics. (January 2008)
*- S. Athreya Uppili (8), Bangalore*

The page for Parents and Teachers is a wonderful addition to the unique **Junior Chandamama**. Very often, I see my son poring over the pages when he runs to me for a meaning, explanation or clarification. (January 2008)
*- Kamaljit Arora, Chandigarh*

**For your gift subscriptions, send the coupon below along with the remittances.**

---

Name of child .................................... Age .......... Class .......... School ....................

Home Address ....................................................................

.................................................................... Pin Code ....................

Please enter 1 year subscription (12 issues delivered at door) for Rs. 170/-

DD / Cheque* No.................on.................Bank for Rs.................enclosed.

* Add Rs. 90/- on outstation cheques.

M.O. for Rs. 170 sent from .................... Post Office Receipt No. .................. Date ..................

Cheque / DD / MO in favour of **Chandamama India Ltd.**
Mail to : **Chandamama India Ltd.**, JVL Plaza, 6th Floor, 626, Anna Salai, Teynampet Chennai - 600 018. Note : Allow 4 weeks for the first copy to arrive by post.

**Date** **Signature**



చందమామ సంపుటి: 60 మార్చ్ 2008 సంచిక:03

## ఈ నెల విశేషాలుమ



నలుగురు కార్యసాధకులు (బే.క) ...19



తప్పించుకున్న వృషభరాజు! ...36



ఎవరి మెడకు ఉరి? ...44



రామాయణం (కిష్కింధా కాండ-5) ...57

## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

దేవతలు పాలసముద్రంలోని రత్నాలతో తృప్తిపడక, కాలకూటానికి బెదరక, అమృతం వచ్చిన దాకా కృషి చేశారు. ధీరులు తమ కోరిక తీరేదాకా పూనిక విడవరు.





# నీళ్ళదాహంతో తపిస్తూన్న ప్రపంచం!

భూమిలో మూడో వంతు మాత్రమే నేల; రెండు భాగాలు జలమయం. అటువంటి భూమి మీద నీటి ఎద్దడి అన్నది చాలా అసంగతమైన పరిస్థితి. శుభ్రమైన, సురక్షితమైన తాగునీరు లభించక పోవడం వల్ల ప్రపంచ వ్యాప్తంగా రోజూ దాదాపు 4,500 మంది పిల్లలు చనిపోతున్నారన్నది దిగ్భ్రాంతి కలిగించే విషయం. 2004వ సం.లో సురక్షితమైన తాగునీరు లభించక 2,200,000 మంది మరణించారు. వీరిలో 90 శాతం మంది ఐదేళ్ళలోపు పిల్లలే.

ప్రస్తుత నీటి ఎద్దడికి కారణం ఏమిటి? ఈ సమస్యను పరిష్కరించడం ఎలాగా? అని ఇటీవల ప్రజలు ఆలోచించడం కాస్త ఊరట కలిగించే విషయం.

1975 నాటికి ఎత్తయిన పర్వతాల మీది మంచుగడ్డలు సగమై పోయాయని ఒక అంచనా. 1975-2000 మధ్య కాలంలో 25 శాతమూ, అప్పటి నుంచి ఇప్పటి వరకు మరో 10, 15 శాతం కరిగిపోయాయి. పరిస్థితి ఇలాగే కొనసాగితే గంగ, నైలు, నైజర్ మొదలైన నదులు ఎప్పుడో ఒకప్పుడు ఎండి పోగలవు అన్నది నమ్మశక్యం కాని నిజం. అయితే దీనికి మూల కారణమైన గ్లోబల్ వార్మింగ్‌కు మనుషులే కారణమని చెప్పవచ్చు. ప్రకృతి పట్ల అశ్రద్ధ, విచక్షణారహితంగా చెట్లను నరకడం, నీళ్ళ విలువ తెలియకుండా వృథా చేయడం, కలుషితపరచడమే ఈ విపత్కర పర్యవసానానికి కారణాలు.

ఇంకా మన దేశంలోని పలు గ్రామాలలో చాలా మంది పసిపిల్లలు దూరం నుంచి నీళ్ళు మోసుకు రావడంలో తల్లులకు సాయపడుతున్నారు. ఆ కారణంగా చదువు సంధ్యలకు దూరమవుతున్నారు. ఇక వారి ఆటపాటల సంగతి సరేసరి.

ఇంతకు మించి నీటి ఎద్దడి సమస్యకు పరిష్కారం కనుగొన వలసిన అవసరం గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఎదుగుతూన్న తరాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ దిశగా కృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఇదే మార్చ్ 22వ తేదీ జరుపుకుంటూన్న ప్రపంచ జలదినోత్సవ సందర్భంగా మనం గుర్తుంచుకోవలసిన విషయం!

సంపాదకుడు : **విశ్వం**

Visit us at : http://www.chandamama.com





చందమామ


*Editor, Publisher :* B. Viswanatha Reddi (Viswam)
*Chief Executive Officer :* L. Subramanyan
*Editorial Advisors :* Ruskin Bond, Manoj Das
*Consultant Editor :* K. Ramakrishnan
*Associate Editor :* A.R. Balasubrahmanyam
*Artists:* K.C. Sivasankaran (Sankar) Gandhi Ayya, P. Mahesh
*Layout Design:* R. Sudha
*Assistants:* D. Revathy, B.A. Hemalata Malini
*Research :* R. Vaasugi

*CIRCULATION TEAM :*
*Chennai :* T N Ravi Shankar, *National Sales Manager*
Mobile +9199620 70014
email: ravishankar.tn@chandamama.com
*Mumbai :* Sanjay Thorat, *Business Development Manager*
Mobile +91 98210 17787
CHANDAMAMA INDIA LTD., B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email: sanjay.thorat@chandamama.com
*New Delhi :* Sushil Sharma, *Circulation Manager-North*
Mobile +91 98719 30767
CHANDAMAMA INDIA LTD., Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* P. Murali, *Asst. Circulation Manager -Karnataka*
Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* Ananth Prakash, *Circulation Manager-East*
Mobile +91 98351 82202
*Advertisement :* email : sales@chandamama.com
*Online and Interactive :* Surajit Agarwal
Mobile +91 99620 70015
email: surajit.agarwal@chandamama.com
*Head Office :* CHANDAMAMA INDIA LTD.,
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. **180.00**
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ
ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.


# పాఠకుల లేఖలు

**రూ. 250/- బహుమతి పొందిన లేఖ**

**జ**నవరి సంచికలో 'పరుసవేది' కథ ప్రతి మనిషిలో మామూలు లోహాల్లా ఎన్నో శక్తులు ప్రకాశించకుండా వుంటాయి, వాటిలో మంచి వాటిని గుర్తించి, సానబెట్టు కోవాలన్న సందేశాన్నిస్తే; మూఢ నమ్మకాలనే మానసిక కాలుష్యం నుంచి కాపాడుకోవాలని 'రాములమ్మ' కథ మనల్ని హెచ్చరిస్తుంది. నమ్మకూడని వారిని నమ్మడం ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో 'నమ్మలేని నిజాలు'లో అద్భుతంగా చెప్పారు. నాకు నచ్చిన కథ శీర్షికన తాతయ్య-బామ్మ చెప్పిన 'దొంగకథ' ఆసక్తికరంగా వుంటే, చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలులో 'పన్నాదాయ్ అనుపమత్యాగాన్ని' చదివిన వారు ఆమె త్యాగాన్ని జీవితాంతం మరువలేరు. అలాగే, ఉత్తరప్రదేశ్ జానపద కథ 'చిలుక జోస్యం', పిల్లలు పంపిన వర్ణచిత్రాలు, కథలుగా చెప్పిన అనుభవాలు ఆకట్టుకున్నాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే, అమరవాణి నుంచి ఆఖరుపేజీ వరకూ చందమామలోని ప్రతి పేజీ అమూల్యమైనదే! చివరగా-చందోబద్ధమైన పద్య కథలు, గేయ కథలు వంటివి సరళంగా అందిస్తే, వ్యాకరణంతో పాటు, భాషలోని తియ్యదనాన్నీ పిల్లలకందించినట్లవుతుందని నా అభిప్రాయం. – ధరణికోట శివరాంప్రసాద్,
బోరబండ, హైదరాబాద్ – **500 018**

**జ**నవరి చందమామలో నాలుగు చెప్పుకోతగ్గ కథలు- బేతాళకథ 'నమ్మలేని నిజాలు' చాలా మెచ్చదగినకథ. రెండు నమ్మలేని నిజాలతో జోడించి, ఒక నమ్మలేని నిజం అంటూ చెప్పి, రాజు కళ్ళు తెరిపించడంలో, రచయిత మంచి చాకచక్యం ప్రదర్శించాడు. కలల మర్మం, అదృష్టవంతుడు-రెంటికి రెండూ ఎన్నదగిన కథలు. ఇక, తాతయ్య-బామ్మ కథ, ఒక 'మాస్టర్ స్టోరీ టెల్లర్' మాత్రమే రాయగలడు.

– డి. శంభుదాసు, విజయవాడ-**10**


© The stories, articles and designs contained in this issue are the exclusive property of the Publishers. Copying or adapting them in any manner/ medium will be dealt with according to law.



# నేత్రసంజీవని

కన్నావరంలోని చింతామణి రోగనిర్ధారణకూ, చికిత్సకూ, హస్తవాసికీ పేరుగాంచిన వైద్యుడు. అయితే, యేటా వేసవిలో ఆ చుట్టు పక్కల గ్రామాల ప్రజలను పట్టి పీడించే వింత కంటి జబ్బును నయం చేయలేక బాధపడసాగాడు. ఉన్నట్టుండి కళ్ళు వాచిపోవడం, నీళ్ళు కారడం, మంట ఆ వ్యాధి లక్షణాలు. కొందరి కయితే ఆ జబ్బు కారణంగా చూపు మంద గించడం కూడా జరిగేది.

ఆ వ్యాధికి సరైన వైద్య విధానం తెలిసి కూడా దానికి సంబంధించిన నేత్రసంజీవనీ మూలిక లభ్యం కాకపోవడం వల్ల ఆయన చికిత్స చేయలేకపోతున్నాడు. ఆ మూలిక కన్నావరానికి దక్షిణంగా కొద్ది దూరంలో ఉన్న చంద్రావళి కొండ దిగువ ఉందని ఆయనకు తెలుసు. అయితే, నరభక్షకులైన రాక్షస దంప తులు ఇటీవల అక్కడ చేరడం వల్ల, ఎవరూ ఆ దరిదాపులకు వెళ్ళడానికి సాహసించలేక పోతున్నారు.

ఇలా ఉండగా, చింతామణి వద్ద కొత్తగా శిష్యుడిగా చేరిన విజయచంద్రుడనే యువకు డికి ఆ మూలికను ఎలాగైనా సంపాదించా లనే బుద్ధి పుట్టింది. అతడు ఒకనాడు దాపుల నున్న మూలికలు తెస్తానని గురువుకు చెప్పి, తిన్నగా చంద్రావళి పర్వతం కేసి నడవ సాగాడు. మిట్టమధ్యాహ్నానికి ఆ కొండను సమీపించి నేత్రసంజీవనీ మూలికను కావలసి నంత సేకరించుకుని, ఆ దాపులనున్న చెట్ల ఫలాలను తిని, సెలయేటి నీళ్ళు తాగి ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

ఆ సమయంలో, ''ఎవడివిరా నువ్వు?'' అన్న భయంకరమైన కేక వినిపించడంతో, విజయచంద్రుడు ఉలిక్కిపడి తల పైకెత్తి చూశాడు.

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



ఒక రాక్షసుడు తన భార్యతో బండల పక్క నుంచి వస్తున్నాడు. వాళ్ళ భయంకర ఆకారాలను చూసి ఒక్క క్షణం భయపడిన విజయచంద్రుడు వెంటనే తేరుకుని, భయపడి ప్రయోజనం లేదని గ్రహించి ధైర్యంగా లేచి నిలబడ్డాడు.

''ఇంకా నా ప్రశ్నకు సమాధానం చెప్పనే లేదు. ఎంత పొగరు? నన్ను చూస్తూంటే భయం లేదా?'' అంటూ రాక్షసుడు రెండు అడుగులు ముందుకు వేశాడు.

అంతలో రాక్షసి అడ్డుపడి, ''నీ మొహం చూసి ఎవడు భయపడతాడు? ఆ కుర్రకుంక నోటి నుంచి క్షణంలో సమాధానం నేను కక్కిస్తాను చూడు,'' అంటూ ముందుకు ఉరికింది.

''మగాడినైన నావల్ల కానిది, ఆడదానివి నీవల్ల ఏమవుతుంది?'' అంటూ రాక్షసుడు గుడ్లురుముతూ విజయచంద్రుడి కేసి తిరిగి, ''చెప్పు, నన్ను చూస్తే నీకు భయం లేదా?'' అని గద్దించాడు.

రక్కస ఆలుమగల మధ్య అంతగా పడడం లేదని వెంటనే గ్రహించిన విజయచంద్రుడు, ''మిమ్మల్ని చూసి భయపడడమెందుకు? ఈ మధ్య మీకన్నా భయంకరమైన ఒక రాక్షసుణ్ణి చూశాను. అతడు నాకు కావలసినంత ధనం కూడా ఇచ్చాడు,'' అన్నాడు విజయచంద్రుడు.

రాక్షసుడు హహహఅని నవ్వి, ''కోతలు బాగా కోస్తావురా బాలకా! నాలాంటి రాక్షసుడు నిన్ను చూడడమేమిటి? మింగకుండా వదిలి పెట్టడమేమిటి?'' అన్నాడు.

''అతడికి నా సలహా కావలసివచ్చింది. అందుకే నాతో స్నేహం చేశాడు,'' అన్నాడు విజయచంద్రుడు.

''రాక్షసుడికి నీ సలహా కావలసివచ్చిందా? ఆశ్చర్యంగా ఉందే! ఏమిటా సలహా?'' అని అడిగాడు రాక్షసుడు.

''అలా అడుగు, చెబుతాను. ఆ రాక్షసుడు... 'మీ మనుషులు చాలా తెలివైన వాళ్ళట కదా! పెళ్ళాలను తమ చెప్పు చేతల్లో ఎలా పెట్టుకుంటారో, నీకేమైనా చిట్కాలు తెలిస్తే చెప్పు' అని అడిగాడు,'' అన్నాడు విజయచంద్రుడు.

''నువ్వు చెప్పావా?'' అని అడిగాడు రాక్షసుడు కాస్త కంఠస్వరం తగ్గించి.

''చెప్పాను. అందుకే కదా ఆ రాక్షసుడు ఎంతగానో సంతోషించి నాకు ధనం, బంగారు

కానుకలు కూడా ఇచ్చాడు,'' అన్నాడు విజయ చంద్రుడు ఏమాత్రం తొణక్కుండా.

ఆ మాట వినగానే రాక్షసుడు ఆలోచనలో పడ్డాడు. వాడి భార్య పరమగయ్యాళి. చీటికి మాటికి మాటలతో, చేతలతో వాణ్ణి సాధిస్తూ, వేధిస్తూ ఉంటుంది. పెళ్ళాన్ని అదుపులో ఉంచుకునే చిట్కాలు తెలుసుకుంటే మంచి దని అనుకుని వాడు, ''ఒరే బాలకా! ఇలారా,'' అంటూ విజయ చంద్రుణ్ణి బండ చాటుకు తీసుకు వెళ్ళి, ''ఆ చిట్కాలేవో నాకూ చెప్పు. నీకు కానుకలిస్తాను,'' అన్నాడు.

విజయచంద్రుడు, ''చెబుతాను, చెబు తాను,'' అంటూండగా వాళ్ళను వెంబడించి వచ్చిన రాక్షసుడి భార్య, ''ఏరా, నన్ను లొంగ దీసుకునే చిట్కాలు నా మొగుడికి చెబు తావా? నిన్నేం చేస్తానో చూడు!'' అంటూ హుంకరించింది.

''వాడేం చెబితే నీకేం? నా కాళ్ళ దగ్గర పడి ఉండాల్సిన అధమ రక్కసివి! నువ్వు వాణ్ణి మింగడానికినేను వదులుతాననుకున్నావా?'' అంటూ అడ్డు పడ్డాడు రాక్షసుడు.

''నీ కాళ్ళ దగ్గరపడి ఉండడమా? అందుకు వేరెవతినైనా చూడు. నేను ప్రాణంతో ఉండగా అది అసాధ్యం,'' అంటూ రెచ్చిపోయింది రాక్షసి.

దాంతో వాళ్ళిద్దరి మధ్యా మాటామాటా పెరిగింది. రక్కుతూ, గిచ్చుతూ బాహా బాహీ పోట్లాటకు దిగారు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు కొట్టుకుంటూ, తిట్టుకుంటూ ఉంటే, విజయ చంద్రుడు గుట్టుచప్పుడు కాకుండా మూలిక లతో అక్కడి నుంచి తప్పించుకున్నాడు.

సాయంకాలానికి నేత్రసంజీవని మూలిక లతో తిరిగివచ్చిన శిష్యుణ్ణి చూసి చింతామణి ఎంతగానో సంతోషించాడు.

''ధైర్యం ఉంటేనే తెలివితేటలు ఉప యోగ పడగలవని చక్కగా నిరూపించావు నాయనా. నీ సమయస్ఫూర్తి బహుధా ప్రశంస నీయం. నీ పాటి ధైర్యం లేకే ఇన్నాళ్ళు ఆ మూలికను సంపాదించలేకపోయాను. నీ ఉపకారబుద్ధి వల్ల ఇక్కడి ప్రజల కళ్ళ జబ్బులు తప్పక తొలగిపోగలవు. ఆయుష్మాన్ భవ!'' అంటూ ఆయన శిష్యుణ్ణి దీవించాడు.





# తరగని నిధి

సూరప్ప పేదరైతు. పగలంతా భార్యతో కలిసి పొలంలో పనిచేసేవాడు. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి అయినప్పటికీ, ఆ దంపతులు తమ ఒక్కగానొక్క కొడుకు వీరప్పను ఏలోటూ లేకుండా అల్లారు ముద్దుగా పెంచారు. తమ బిడ్డయినా నాలుగు అక్షరాలు నేర్చుకుని సుఖపడాలని ఆశించారు.

అయితే, వీరప్పకు ఒళ్ళొంచి పనిచేయాలంటే మహాబద్ధకం. చదువంటే పరమ చిరాకు. వ్యాపారం చెయ్యడం కష్టం. కత్తిసాము వంటి యుద్ధవిద్యలు నేర్వాలంటే అందుకు సాధనచేయాలని భయం. అయినా ఇవన్నీ ఏమీ చెయ్యకుండానే వైభవంగా జీవించాలని మనసు. అందువల్ల ఎలాంటి శ్రమా పడకుండా సులభంగా సుఖసంతోషాలతో జీవించడం ఎలాగా అని ఎల్లప్పుడూ ఊహల్లో తేలుతూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఊరికి ఆనుకునివున్న అడవికి ఆవలగల కొండ గుహలో ఉంటూన్న సుపథుడనే యోగి గురించి వీరప్పకు తెలియవచ్చింది. మహిమలు గల ఆ యోగి, దాపులనున్న సెలయేటిలో స్నానం ముగించి వస్తూండగా మొదట నమస్కరించిన వారి కోరికలు ఏవైనా సరే తీరుస్తాడని తెలియడంతో వెంటనే ఆయన్ను వెతుక్కుంటూ బయలుదేరాడు.

సూర్యోదయం వేళ యోగి స్నానం ముగించి గుహకు తిరిగివస్తూండగా వీరప్ప ఆయన పాదాలకు నమస్కరించి, ''సులభమార్గంలో వైభవంగా జీవించడానికి తమ ఆశీస్సులు కావాలి,'' అన్నాడు.

''కష్టపడకుండా ఏదీ సాధ్యం కాదు. అయినా, ఈ సమయంలో ప్రార్థన మన్నించడం నా నియమం గనక, ఈ తావీదును

'వసుంధర'

ఇస్తున్నాను. దీని సాయంతో పైకిరావడానికి ప్రయత్నించు, అయితే, ఇది ఒక్కసారి మాత్రమే పనిచేస్తుందన్న విషయం గుర్తుంచుకో. మనోరథ సిద్ధి ప్రాప్తిరస్తు!'' అని దీవించి ఒక తావీదును ఇచ్చి వెళ్ళాడు సుపథుడు.

మహిమగల తావీదు సులభంగా దొరకడం అదృష్టమనుకుంటూ వీరప్ప అక్కణ్ణించి బయలుదేరి ఒక నగరం చేరుకున్నాడు. పగలంతా నగర వీధిలో అటూ ఇటూ తిరుగుతూంటే ఒక చోట విధనుడు, వివేకుడు అనే ఇద్దరు మిత్రుల సంభాషణ అతణ్ణి ఆకర్షించింది.

''వ్యాపారంలో ఒక్క రోజులో లక్షవరహాలు లాభం వచ్చిందని విన్నాను. అసలే ఊళ్ళో దొంగల భయం ఎక్కువగా ఉంది. డబ్బంతా ఎక్కడ దాస్తున్నావు? జాగ్రత్త సుమా,'' అన్నాడు వివేకుడు.

''నా ఇంటికి గట్టి కాపలా ఉందిలే కానీ, మొదట నీ సంగతి చూసుకో. మిత్రమా! ఈ మధ్య నీకు సన్మానాల మీద సన్మానాలు కదా! వచ్చిన సొమ్మంతా ఏం చేస్తున్నావు? అసలే నీ ఇంటికి కాపలా కూడా లేదు,'' అన్నాడు విధనుడు.

వివేకుడు నవ్వి, ''వచ్చిన సొమ్మంతా ఎప్పటికప్పుడు తరగని నిధిగా మార్చేస్తున్నాను. దొంగలు దోస్తే కుబేరుడి కోశాగారం వట్టి పోతుందా? నా ఇల్లూ అంతే. దానికి కాపలా అక్కర లేదు,'' అన్నాడు.

వారి మాటలు విని వీరప్ప మనసు ఆనందంతో ఉప్పొంగింది. అదృష్టం కొద్దీ వివేకుడింట తరగని నిధి ఉన్నట్టు తెలిసింది. దాన్ని



దోచుకుంటే తన జీవితమంతా వైభవంగా బతకవచ్చు. వివేకుణ్ణి అనుసరించి వెళ్ళి ఆ ఇల్లెక్కడో చూసుకున్నాడు. అది పెద్ద మేడ కావడంతో అక్కడ పెద్ద నిధే ఉండవచ్చని మురిసిపోయాడు.

రాత్రికాగానే ఆ ఇంటి ముందుకు వచ్చి చేతికి తావీదు కట్టుకుని సుపథుడి పేరు ముమ్మారు స్మరించి, ధైర్యంగా ఇంటిలోకి ప్రవేశించాడు. లోపల ఎక్కడ చూసినా అంద మైన చిత్రపటాలు, మనోహరమైన రాతి శిల్పాలు కనిపించాయి. లెక్కలేనన్ని తాళ పత్ర గ్రంథాలు ఉన్నాయి. తను ఊహించి నట్టు వజ్రవైడూర్యాలు, వెండి, బంగారు వస్తువులు, ఆభరణాలు కనిపించలేదు. వెదికి వెదికి విసిగిపోయిన వీరప్ప నీరసంగా ఇంటి బయటకొచ్చాడు.

వివేకుడి తరగని నిధి రహస్యం గురించి సుపథుడినే అడగాలని నిర్ణయించుకుని తిరిగి అడవికి వెళ్ళాడు.

జరిగింది విన్న సుపథుడు నవ్వి, ''పండి తులకు తరగని నిధి అంటే డబ్బు కాదు, జ్ఞానం. ఆ జ్ఞానం పుస్తకాల్లో నిక్షిప్తమై ఉంటుంది. వివేకుడు తను సంపాదించిన సొమ్మును పుస్తకాల సేకరణకే వినియోగి స్తాడు. అందుకే దొంగలు దోచుకుంటారనే భయం ఉండదు,'' అన్నాడు.

''మరి నేనిప్పుడేం చేయాలి? తమరిచ్చిన తావీదు వృథాయేనా?'' అన్నాడు వీరప్ప దీనంగా.

''నువ్వు ఎన్నుకున్నది వివేకుడి ఇల్లు కాబట్టి, తిరిగి ఆయన ఇంటికి వెళ్ళి, ఆయన్ను ఆశ్రయించి జ్ఞానం సముపార్జించు. తావీదు మహిమ వల్ల నీకు గ్రహణ శక్తి పెరిగి త్వరగా జ్ఞానవంతుడివవుతావు. ఆ జ్ఞానమే నీకు తరగని నిధి అయి, నీ జీవితాన్ని వైభ వంగా మార్చగలదు,'' అన్నాడు సుపథుడు మందహాసంతో.

ఆయన చెప్పినట్టే వీరప్ప వివేకుడి నాశ్ర యించి, జ్ఞాన సముపార్జన చేసి, క్రమ క్రమంగా పండితుడిగా గుర్తింపు పొంది, గౌరవ ప్రతిష్ఠలతో కలకాలం సుఖసంతోషాలతో జీవించాడు.






# రాకాసిలోయ

## 31

[అడవి మనుషుల సాయం వల్ల కేశవుడూ అతడి అనుచరులు బంధ విముక్తులయ్యారు. తరవాత వాళ్ళు రెక్కల మనుషుల గుడారాలకు నిప్పుపెట్టి, అప్పుడు చెలరేగిన గందరగోళంలో, అక్కడి నుంచి తప్పించుకుని పారిపోసాగారు. కాని, వాళ్ళను అంతకు ముందే కాపువేసిన శత్రువులు మొసళ్ళ మడుగు వద్ద అటకాయించారు. బిడాలీ, శ్వానకర్ణి కేశవుడి కోసం కేకలు పెట్ట సాగారు. –తరవాత]

కేశవుడి అనుచరులను రక్షించ వచ్చిన ఇద్దరు అడవి మనుషులూ, తమ నాయకులు పెట్టే కేకలు విని ఎంతో ధైర్యం తెచ్చుకున్నారు. ఒకటి రెండు నిమిషాల కాలం రెక్కల మనుషుల చేతికి చిక్కకుండా పోరాడగలిగితే, ఆ తరవాత తమ జాతి వాళ్ళ సాయం వస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది. కేశవుడూ, జయమల్లూ కూడా పరిస్థితి గ్రహించి, ఎక్కడలేని ధైర్యం తెచ్చుకున్నారు. వాళ్ళు కోయగోమాంగ్‌ను ఉత్సాహపరుస్తూ, రెక్కల మనుషులను మొసళ్ళ మడుగులోకి నెట్టసాగారు. ఇంతలో గోమాంగ్ కింద పడివున్న పొడవాటి ఈటె నొకదాన్ని చేతికి తీసుకుని, దానితో రెక్కల మనుషుల్ని బలంగా పొడుస్తూ, "కేశవా, ఇక మనకు ప్రమాదం లేదు. ఆయుధం దొరికింది. మీరు కూడా ఈ దుర్మార్గులతో కుస్తీ పట్లు మాని ఆయుధాలు తీసుకోండి," అని అరిచాడు.

'చందమామ'



గోమాంగ్ చేత ఈటె దెబ్బలు తిన్న రెక్కల మనుషులు కీచుమని అరుస్తూ మొసళ్ళ మడుగులో పడసాగారు. అది చూస్తూనే మిగిలిన వాళ్ళు అక్కడి నుంచి కాలిబలం కొద్దీ పరిగెత్తుతూ, ''పులుగురాయా! ప్రమాదం. గుహావాసులు వందల వేల సంఖ్యలో మన మీదికొస్తున్నారు,'' అని కేకలు పెట్టారు. ఆ హెచ్చరిక వింటూనే ఎక్కడెక్కడ వున్న రెక్కల మనుషులూ ఆ ప్రాంతం వదిలి అడవి కేసి బయలుదేరారు. తన అనుచరులను ప్రోత్స హించి, అడవి మనుషులతో యుద్ధానికి పూనుకోవటం సాధ్యంకాదని పులుగురాయుడు గ్రహించాడు. కాని, ఒకసారి అడవి మనుషులకు వెన్నుచూపితే, ఆ తరవాత వాళ్ళు తనను, పిరికిపంద కింద జమకట్టే ప్రమాదం వున్నది. ఇప్పుడేమి చేయటం?

పులుగురాయుడి తటపటాయింపు గ్రహించిన బ్రహ్మదండి మాంత్రికుడు మంత్రదండాన్ని పైకెత్తి, ''జై కాలభైరవా!'' అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, ''పులుగు ప్రభో! ఇది మనకు కష్టకాలం. కాలభైరవుడు ఎందుకనో ఆగ్రహించాడు. ఆ గుహావాసులూ, జయమల్లు మూతా వచ్చి మన మీద పడకముందే, అడవిలోకి తిరోగమిద్దాం,'' అన్నాడు.

''మాంత్రికా, అదే నేనూ అనుకుంటున్నాను. మా గరుడజాతి వాళ్ళకు రాత్రిళ్ళు కళ్ళు కనిపించవు. సూర్యోదయం కానివ్వండి, మా ధాటి చూపెడతాం,'' అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అంతలో జిత, శక్తివర్మలు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళ చేతుల్లో వున్న కత్తులు సగం విరిగి వున్నాయి. వాళ్ళ దేహాలు రక్తంతో తడిసి వున్నాయి.

జిత, శక్తివర్మలను చూస్తూనే బ్రహ్మదండికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అతడు వాళ్ళను సమీపించి, ''జితా, శక్తీ! మీరు ఇంకా బతికే వున్నారా? ఆ దుర్మార్గులు మీ ఇద్దర్నీ హత్య చేశారనుకున్నాను,'' అన్నాడు.

''వాళ్ళా... మమ్మల్నా... హత్యా!'' అంటూ జితవర్మ పెద్దగా నవ్వి, ''మా మొండికత్తులు చూడు, నెత్తురులో స్నానమాడిన మా శరీరాలు చూడు! ఎంత మంది శత్రువుల్ని చంపామో మాకే తెలీదు. కత్తులు విరిగిపోవటంతో వెనుదిరిగి ఇటు పురోగమించి రావలసి వచ్చింది,'' అన్నాడు.

జితవర్మ మాటలకు స్థూలకాయుడు విరగబడి నవ్వుతూ, ''మీ ఇద్దర్లో ఏ ఒకడూ

శత్రువులను చూశామని చెప్పినా నేను నమ్మను. ఇంతసేపూ ఏ చెట్టుకొమ్మల్లోనో దాక్కుని వుంటారు!'' అన్నాడు.

స్థూలకాయుడి మీదికి జిత శక్తివర్మలు తమ మొండికత్తుల్ని ఎత్తేంతలో, పులుగు రాయుడు, ''ఛీ, ఇక వూరుకోండి. మీ నుంచే నా రాజ్యానికి ఇంత ప్రమాదం వచ్చింది. మీ కాపలాలో వున్న ఆ దుర్మార్గులు ఎలా తప్పిం చుకుపోగలిగారు? ఆ సంగతేదో ఇక్కడే తేలాలి. మిమ్మల్ని రాకాసిపక్షిమాతకు బలి చేస్తాను,'' అంటూ ఈటెను వాళ్ళ మీదికి ఎత్తాడు.

అంతలో గుహావాసులు అటుకేసి వస్తున్న సూచనగా కేకలు వినబడినై. బ్రహ్మదండి మాంత్రికుడు, పులుగురాయుడి చేయి పట్టుకుని, ''పులుగుదేవా! మీరు శాంతిం చండి. ఆ అడవిమనుషుల దండు ఇటే వస్తున్నది. ముందు మనం ఇక్కణ్ణించి పారి పోకపోతే ప్రమాదం,'' అన్నాడు.

బ్రహ్మదండి మాట ముగించే లోపలే పులుగురాయుడు అడవి కేసి పరుగులం కించుకున్నాడు. స్థూలకాయుడూ, బ్రహ్మ దండి మాంత్రికుడూ, జిత, శక్తివర్మలు కూడా అతడి వెనక పరిగెత్తారు. జితవర్మ శక్తివర్మతో, ''శక్తీ, చూశావా? మనం శత్రువులను చీల్చి చెండాడేందుగ్గాను కనబరిచిన శూరవీరత్వం, అద్భుత సాహసధైర్యాలూ ఎందుక్కొరగా కుండా పోయినై. ఆ పిట్టతల వెధవా, బ్రహ్మ దండీ కూడా మన దర్పబల శౌర్యాలను శంకిస్తు న్నారు,'' అన్నాడు.



''వాళ్ళిద్దరే శంకించటమేం! ఈ మాంసం పోగు కూడా మనను అపహాస్యం పట్టిస్తు న్నాడు,'' అన్నాడు శక్తివర్మ.

అంతలో వాళ్ళకు ''బిడాలికీ జై!'' అన్న కేకలూ, రివ్వురివ్వు మంటూ మీదికి వచ్చిపడే ఈటెలూ ప్రత్యక్షమయినై. ''మరి కొంచెం వేగంగా పరిగెత్తండి. శత్రువులు మనను చూసి నట్టుంది. జితా, శక్తీ! మీ నోళ్ళు మూయండి!'' అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు లేడిలా ఛెంగున ముందు కురికాడు.

కేశవుడు తన అనుచరులనూ, బిడాలీ, శ్వానకర్ణి ముఠా వాళ్ళనూ వెంటపెట్టుకుని వచ్చి, పులుగురాయుడు నివసించే గుడా రాల ప్రాంతాన్ని చుట్టుముట్టే సరికి, అక్కడ వారికి రెక్కల మనుషులెవరూ కనిపించ లేదు. ఆ దుర్మార్గులు ప్రమాదం శంకించి



అడవి కేసి పారిపోయి వుంటారని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకున్నారు. కాని, చీకటిలో వాళ్ళను వెంబడించి చుట్టుముట్టటం సాధ్యమయ్యేది కాదు. ఆ కారణం వల్ల కేశవుడు గుహావాసులను చిన్నచిన్న ముఠాలుగా అడవి ప్రాంతానికి వెళ్ళి, కనబడిన రెక్కల మనుషులను హతమార్చమన్నాడు. అలా బయలుదేరిన ఒక ముఠా చేతిలో పడవలసిన బ్రహ్మదండీ, పులుగురాయుడూ అదృష్టవశాన తప్పుకుని అడవిలోకి పారిపోగలిగారు.

రాత్రి గడిచి సూర్యోదయం అయ్యేవరకూ కేశవుడూ అతడి అనుచరులు కాలుతున్న పులుగురాయుడి గుడారాల ప్రాంతాలనే కాలం గడిపారు. రెక్కల మనుషులు చెట్ల మీది నుంచి కిందికి దూకేందుకు ఉపయోగించే పక్షిరెక్కలు వాళ్ళకు ఒకచోట గుట్టలు గుట్టలుగా కనిపించినై. వాటిని చూడగానే బిడాలికీ, శ్వానకర్ణికీ ఇంత కాలంగా వాళ్ళు చేసిన మోసం తెలిసిపోయింది.

''నిజంగా వాళ్ళు రెక్కలున్న మనుషులని మేం నమ్మాం. వాళ్ళు పక్షుల్లా ఆకాశంలోకి ఎగరగలరని కూడా మేం భావించాం. అంతా మోసం!'' అన్నాడు బిడాలి.

''ఆ మోసమేదో ఇప్పుడు తెలిసి పోయింది. ఇక ఆ నీచుల్ని అడవిబాతుల్ని వేటాడినట్టు వేటాడతాం,'' అన్నాడు శ్వానకర్ణి.

గుహావాసుల నాయకులిద్దరికీ కలిగిన ఆత్మవిశ్వాసం చూసి, కేశవుడూ, జయమల్లూ సంతోషించారు. సూర్యోదయమై నాలుగుబారల పొద్దెక్కగానే, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్‌ల గౌరవార్థం; బిడాలీ, శ్వానకర్ణీ గొప్ప విందు ఏర్పాటు చేశారు.

ఆ విందు జరిగేటప్పుడు ఆటలూ పాటలూ సాగినై. యువకులైన గుహావాసులు మల్లయుద్ధాలూ, ఈటెలతో రకరకాల వ్యాయామాలూ చేశారు. విందు మధ్య జయమల్లు బిడాలికీ, శ్వానకర్ణికీ ఒక సలహా ఇచ్చాడు. రెక్కల మనుషుల ప్రమాదం ఇక లేదు గనక, వాళ్ళిద్దర్నీ తమ తమ ముఠాలతో కొండ గుహలు వదిలి వచ్చి, సమతలంగా వున్న ఆ ప్రాంతాల విశాలమైన గృహాలు నిర్మించుకోమన్నాడు. ఈ సలహాకు శ్వానకర్ణి అనంగీకార సూచకంగా తల వూపి, 'మేము మా తాత ముత్తాతలకు పూర్వం నుంచి కూడా గుహల్లోనే కాలం గడుపుతున్నాం. ఇప్పుడు ఆ ఆచారం వదిలి, ఈ చెట్ల కింద ఎలా నివసించటం?'' అన్నాడు.



బిడాలి కూడా, ''అవును, అవును,'' అంటూ అదే అభిప్రాయం వెలిబుచ్చాడు.

జయమల్లు చిరునవ్వు నవ్వి, ''అయితే, ఒక పని చెయ్యండి. ఒకేసారి అందరూ గుహలు వదిలి రాకుండా, మీలో కనీసం యువతరం వాళ్ళనైనా ఇక్కడ నివసించేలా చేయండి. గుహల్లో వుండటం కన్నా, ఇక్కడ వెలుగూ, గాలీ వున్న ప్రాంతాల నివసించటం ఆరోగ్యకరం అని తేలితే, మిగతా వాళ్ళు కూడా ఆ తరవాత ఇక్కడికి రావచ్చు. ఏది ఏమైనా, ఆ రెక్కల మనుషుల్ని మాత్రం తిరిగి ఇక్కడికి వచ్చి గుడారాలు కట్టకుండా చూడండి. ఈ ప్రాంతం మంచినీటి సమృద్ధీ, ఆహార సమృద్ధీ కలది,'' అన్నాడు.

''ఆ రెక్కల మనుషుల్ని గురించిన భయం మా కేమీ లేదు. మీ సహాయం వల్ల నేను మా మూలపురుషుడి మహత్తర శక్తులు గల గద సంపాయించుకున్నాను. బిడాలికీ నాకూ మధ్య ఇప్పుడు శత్రుత్వమేమీ లేదు, మేము మిత్రులం. మా రెండు ముఠాలకూ మీరు చేసిన మేలు మరువరానిది. మా నుంచి మీ కెలాంటి సహాయం కావాలో అడగండి. ఎంత కష్టసాధ్యమైనదైనా చేయగలం,'' అన్నాడు శ్వానకర్ణి. అతడి మాటలకు అంగీకార సూచకంగా బిడాలి తల వూపాడు.

జయమల్లు, ''మీరు, కోరితే మాకెలాంటి సహాయమైనా చేస్తారని మాకు తెలుసు. మేము రాకాసిలోయకు వెళ్ళాలి. అక్కడికి వెళ్ళి తిరిగివచ్చిన వారెవరైనా మీలో వుంటే చెప్పండి,'' అన్నాడు.

జయమల్లు ఇలా అనగానే బిడాలీ, శ్వానకర్ణులు ముఖముఖాలు చూసుకున్నారు. ఇద్దరి ముఖాల్లో ఆశ్చర్యం, భయం తాండవించాయి. శ్వానకర్ణి గొంతు సవరించుకుని వూరుకున్నాడు. బిడాలి చిన్నగొంతుతో, ''ఆ రాకాసిలోయకు వెళ్ళివచ్చిన వాళ్ళెవరూ, మా తరం వాళ్ళలో బతికి లేరు. కాని, దాన్ని గురించి విన్నాం. అది ఈ అరణ్యాల కవతల గల కొండల్లో ఒక గొప్పలోయ. అక్కడికి చేరటం చాలా కష్టం; తిరిగి రాగలగటం అంతకన్న కష్టం. ఇంతకూ అక్కడి కెళ్ళవలసిన పని మీకేం కలిగింది?'' అని ప్రశ్నించాడు.

''బిడాలీ! నీ మాటలనుబట్టి చూస్తూంటే, నీకు ఆ ప్రాంతాలకు వెళ్ళే దారి తెలుసునన్నట్టు కనబడుతున్నది. ఆ మార్గం ఏదో చూపించు, చాలు. ఆ లోయలో పెరిగే ఒక

గొప్ప ఓషధి మాకు కావాలి. బ్రహ్మపుర రాజుకు నయంకాని వ్యాధి ఒకటి పుట్టింది. ఆ ఓషధితో ఆయన వ్యాధి కుదరగలదని రాజవైద్యులు మమ్మల్ని పంపారు,'' అన్నాడు జయమల్లు.

''బిడాలి చెప్పినట్టు, ఆ లోయకు వెళ్ళటం, తిరిగిరావటం కూడా అసంభవం, ఆలోచించుకోండి,'' అన్నాడు శ్వానకర్ణి.

''అవన్నీ ఆలోచించకుండానే, ఇంత దూరం వచ్చామనుకున్నావా, శ్వానకర్ణీ? మేం ఎలాంటి ప్రమాదాలనైనా ఎదుర్కోటానికి సిద్ధంగానే వున్నాం. దారేదో మాకు చూపండి. పోతే, మీరు మాకు చేయవలసిన మరొక సహాయం; ఆ పులుగురాయుడి వెంట, బ్రహ్మదండి అనే మాంత్రికుడొకడున్నాడు. వాడు మీకు దొరికితే ప్రాణాలతో మేం తిరిగి వచ్చిన దాకా బందీగా వుంచినా సరే, లేక చంపినా సరే, మా అభ్యంతరం ఏమీ లేదు,'' అన్నాడు జయమల్లు.

''ఓ అలాగే! మీకు రాకాసిలోయకు దారి చూపటమే కాదు, మీ వెంట నేనూ, బిడాలీ కూడా వస్తాం. ఏమంటావ్ బిడాలీ?'' అని అడిగాడు శ్వానకర్ణి.

బిడాలి ఎక్కడలేని ఉత్సాహం కనబరుస్తూ, ''నేను పెద్దవాణ్ణయి పోయాను. నా ముఠాకు నాయకుడుగా తగిన యువకుణ్ణొకణ్ణి చూసి నియమించి, మీ వెంట రాగలను,'' అన్నాడు.

దీనికి కేశవుడూ, జయమల్లూ అభ్యంతరం చెప్పారు. తరవాత కొంత చర్చ జరిగిన మీదట, సూర్యాస్తమయానికి ఓ గంట ముందుగా, కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ అక్కడవున్న ఎత్తయిన పర్వత శిఖరాల మీది నుంచి, ఊడల సాయంతో బిడాలీ, శ్వానకర్ణీ ముఠావాళ్ళు లోయలోకి దించారు. ఆలోయలో వున్న ఒకానొక సొరంగ మార్గం వెంటపోతే, అది రాకాసిలోయకు దారి తీయగలదని వాళ్ళు చెప్పారు.

ఊడల సాయంతో కొండశిఖరం మీది నుంచి లోయలోకి దిగిన కేశవుడూ అతడి అనుచరులకు దూరంగా డప్పులమోత వినబడింది. వాళ్ళు అటుకేసి చూశారు. గణాచారిలా జుట్టు విరబోసుకున్నట్టున్న రంగుల కిరీటంతో ఒకడు, చిందులు వేస్తూ కేకలు పెడుతున్నాడు. అతడి చేతిలో భయంకర రూపం గల ఒక పక్షి వున్నది. -(ఇంకావుంది)






# నలుగురు కార్యసాధకులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఎలాంటి అద్భుత శక్తులు సాధించాలని భూత ప్రేత పిశాచాలు తిరుగాడే ఈ శ్మశానంలో శ్రమపడుతున్నావో తెలియదు. అయితే, ఎంతో కష్టపడి సాధించే అద్భుత శక్తులు అవసరమైనప్పుడు ఉపయోగపడకపోగా ఎదురుతిరిగే ప్రమాదమూ లేకపోలేదు. ఇందుకు ఉదాహరణగా నలుగురు కార్యసాధకుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మాణిక్యపురిలోని వజ్రాల వ్యాపారి పద్మనాభుడి ఏకైక కుమార్తె ప్రత్యూష. ఆమె యుక్తవయస్కు

బేతాళ కథలు



రాలు కాగానే, తన బాల్యమిత్రుడి కుమారుడు హేమానందుడికిచ్చి వివాహం జరిపించాలని ఆశించాడు పద్మనాభుడు. అయితే, వివాహానికి కొన్ని రోజుల ముందు ప్రత్యూషకు వింతవ్యాధి సోకి, మాటా పలుకూ లేకుండా అచేతనురాలై పోయింది. విచారగ్రస్తుడైన పద్మనాభుడు ఎందరో వైద్యులను పిలిపించి వైద్యం చేయించాడు. కాని, ఫలితం కనిపించలేదు. ఆఖరికి కృపాళువు అనే వైద్యుడు ప్రత్యూషను పరీక్షించి, ''ఇది నాడీ మండలానికి సంబంధించిన వ్యాధి. దిరసవంచపురంలోని దశమూలం అనే మూలికతో తయారయ్యే దశమూలారిష్టంతో మాత్రమే దీనిని నయం చేయవచ్చు. అయితే, ఆ మూలికను తీసుకురావడం సులభ సాధ్యం కాదు,'' అన్నాడు నిట్టూరుస్తూ.

''దిరసవంచపురం ఎక్కడ ఉన్నది?'' అని అడిగాడు అక్కడే వున్న హేమానందుడు.

''తూర్పు సముద్రంలో వంద ఆమడల దూరంలోని మయూరద్వీపం మధ్య దిరసవంచపురం ఉన్నదని తాళపత్ర గ్రంథాలలో చదివాను. అంతకు మించిన వివరాలు తెలియవు,'' అన్నాడు వైద్యుడు.

''నా ప్రాణాలు పణంగా పెట్టయినా దానిని తీసుకువస్తాను,'' అన్నాడు హేమానందుడు.

''ఆ మూలికను తేగలిగితే ప్రత్యూషను రక్షించడమే కాకుండా, ఇటువంటి వ్యాధితో బాధపడేవారికందరికీ ఎంతో మేలు చేసినవాడవు కాగలవు. విజయోస్తు,'' అని దీవించాడు వైద్యుడు.

హేమానందుడి వెంట అతడి మిత్రుడు శివనాదం, వైద్యుడి శిష్యుడు సంజీవరాయుడు తోడుగా బయలుదేరారు. ఆ సంగతి తెలిసి సాహసప్రియుడైన కపర్ది అనే మరొక యువకుడు కూడా వస్తానన్నాడు.

నలుగురూ సముద్రతీరం చేరి, పడవలో సముద్ర పయనం ప్రారంభించారు. ఐదు రోజులు ప్రశాంతంగా గడిచింది. ఆరో రోజు మిట్టమధ్యాహ్న సమయంలో పది ఏనుగుల పరిమాణంతో వున్న ఒక తిమింగిలం ఎదురై, పడవను తోకతో కొట్టడంతో, పడవ గాలిలోకి లేచి ఆమడ దూరంలో పడి ముక్కలుగా విరిగిపోయింది. హేమానందుడు మునిగిపోయే స్థితిలో కొట్టుమిట్టాడు తూండగా, శివనాదం తనకు ఆధారంగా ఉన్న పడవ కొయ్యముక్కను అతనికి అందించి, ''దీని

సాయంతో నువ్వు ఒడ్డుకు చేరుకో,'' అంటూ ఈదుకుంటూ వెళ్ళాడు.

ఒడ్డుకు చేరిన హేమానందుడు, సంజీవ రాయుడు, కపర్ది ఎంత సేపు నిరీక్షించినప్పటికీ శివనాదం జాడ కనిపించలేదు. విచారంతో ముందుకు నడిచారు. రెండు రోజుల ప్రయాణం తరవాత నిటారుగా ఉన్న పర్వత శ్రేణులను చూసి ముందుకు వెళ్ళలేక ఒక బండమీద చతికిలబడ్డారు.

కొంతసేపటికి ఆకాశంలో వాళ్ళకొక వింత శకటం కనిపించింది. అది చూస్తూండగానే వచ్చి వాళ్ళ ముందు దిగింది. అందులో ఒక పండు ముదుసలి కనిపించాడు. ''తాతయ్యా, దిరుసవంచుపురానికి ఎటు వెళ్ళాలో తెలుసా?'' అని అడిగాడు హేమానందుడు.

''అది ఈ కొండల మధ్య ఉన్నది. కాని అక్కడికి కాలినడకనవెళ్ళ లేరు. ఈ వాయు శకటం ఎక్కి వెళ్ళడం ఒక్కటే మార్గం. చిన్నప్పటి నుంచీ నాకు ఆకాశంలో పయనించాలనే బలమైన కోరిక ఉండేది. ఎన్నెన్నో ప్రయోగాలు చేశాను. దూరదేశాల నుంచి యంత్ర పరికరాలు తెప్పించాను. ఎట్టకేలకు ఆకాశంలో ఎగిరే ఈ వాయుశకటాన్ని రూపొందించాను. అయితే, అప్పటికే నాకు నూరేళ్ళు దాటిపోయాయి. జీవితంలో ఎలాంటి సుఖమూ అనుభవించలేదు. ఇప్పుడా ఆశ కలుగుతోంది. మీలో ఎవరైనా మీ యౌవనం నాకిచ్చేలా ఉంటే, నేను మీకీ వాయుశకటాన్ని ఇవ్వగలను. ఇందులో మీరు దిరుసవంచుపురం వెళ్ళవచ్చు,'' అన్నాడు వృద్ధుడు.



సంజీవరాయుడు తన యౌవనాన్ని ఇవ్వడానికి ముందుకు వచ్చాడు. హేమానందుడు అడ్డు చెబితే, ''అద్భుత ఔషధం తయారు చేసే యజ్ఞంలో సమిధనయ్యే భాగ్యానికి నన్ను దూరం చేయవద్దు,'' అని నచ్చజెప్పాడు.

ఆ తరవాత వృద్ధుడు చెప్పినట్టు సంజీవ రాయుడు మంత్రం పఠించడంతో, అతడి యౌవనం వృద్ధుడికీ, ఆయన వృద్ధాప్యం సంజీవరాయుడికీ మారిపోవడంతో సంజీవ రాయుడు సొమ్మసిల్లి పడిపోయాడు. యౌవనం పొందిన వృద్ధుడు సంతోషంగా వారికి వాయు శకటం ఎలా నడపాలో వివరించి, ''మీ మిత్రుడి సంగతి నేను చూసుకుంటాను. మీరు బయలుదేరండి,'' అన్నాడు.

భారంగా మారిన హృదయంతో హేమానందుడు కపర్దితో కలిసి వాయుశకటంలో



దిరసవంచపురం చేరాడు. నగరవీధులలో జంతువుల తలలతో, మానవశరీరాలతో వింత ప్రాణులు తిరుగాడడం కనిపించింది. వాయు శకటాన్ని పొదల చాటున దాచి, ఇద్దరూ ఒక గుడిసెలోకి దూరారు. అక్కడ ఒక ముసలమ్మ వారిని ఎవరన్నట్టు ఆశ్చర్యంతో చూసింది.

''అవ్వా, మేము పరదేశస్థులం. దశమూలం అనే మూలిక కోసం వచ్చాం. ఇక్కడున్న వాళ్ళు మనుషులా? జంతువులా?'' అని అడిగాడు హేమానందుడు.

''నువ్వు చెప్పే మూలిక కోట ఉద్యాన వనంలో ఉన్నది. మీరు చూసిన వాళ్ళందరూ మనుషులే. అయినా చెప్పుకుంటే మాత్రం మా బాధలు మీరు తీర్చగలరా?'' అన్నది ముసలమ్మ బాధగా. ''అవ్వా ఈ దుస్థితి వారికెలా వచ్చిందో చెప్పు. మాకు చాలా విద్యలు వచ్చు. మా చేతనైతే సాయపడగలం,'' అన్నాడు కపర్ది.

''మా దేశపు రాణి బ్రహ్మానందిని అద్భుత సౌందర్యరాశి. మహాదంభుడనే మాంత్రికుడు ఆమెను చూసి మోహపరవశుడై, రాకుమారుడి రూపంలో వచ్చి తనను పెళ్ళాడమన్నాడు. మాదేశ సంప్రదాయం ప్రకారం మహారాణి జీవితాంతం కన్యగానే ఉండాలి. చరమ దశలో ఆమె మరో కన్యను రాణిగా నియమిస్తుంది. ఈ సంప్రదాయాన్ని ఉల్లంఘిస్తే ప్రజలకు అరిష్టమని, వాడి కోరికను తిరస్కరించింది రాణి. మాంత్రికుడు ఆగ్రహం చెంది నిజరూపంతో ప్రత్యక్షమై, కొందరు భటులను, వృద్ధులను తప్ప తక్కిన ప్రజలందరినీ ఇలా వింత రూపాలకు మార్చి చిత్రహింసలు పెడుతూ, ఎప్పటికైనా రాణి తన కోరిక తీర్చకపోతుందా అని ఎదురుచూస్తున్నాడు,'' అన్నది ముసలమ్మ.

''మాంత్రికుణ్ణి నిర్వీర్యం చేసే మార్గమేదైనా ఉన్నదా?'' అని అడిగాడు కపర్ది.

''అద్భుతశక్తిగల మంత్రదండం వాడి చేతిలో ఉంది. అదే వాడి బలం అని కొందరు చెప్పగావిన్నాను,'' అని ముసలమ్మ అంటూండగా, మాంత్రికుడు వాళ్ళముందు ప్రత్యక్షమై, ''ఎవరు మీరు? ఇక్కడికి ఎలా వచ్చారు?'' అని అడిగాడు.

''నీ దుర్మార్గం అంతంచేయడానికి వచ్చిన వీరులం!'' అన్నాడు కపర్ది.

''నేను మాంత్రికుణ్ణి తెలుసా?'' అంటూ మహాదంభుడు మంత్రదండాన్ని పైకెత్తి

బోతూండగా, ''నేను మహా మాంత్రికుణ్ణి!'' అంటూ కపర్ది దాన్ని సర్పంగా మార్చడంతో, హడలిపోయిన మహాదంభుడు దండాన్ని జారవిడిచాడు. ఒక్కగెంతున వెళ్ళి కపర్ది దాన్ని చేజిక్కించుకున్నాడు. మంత్రదండాన్ని కోల్పోయిన మహాదంభుడు అవాక్కయి దిక్కులు చూడసాగాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన మహారాణి బ్రహ్మనందిని మాంత్రికుణ్ణి బంధించమని భటులను ఆజ్ఞాపించింది. మాంత్రికుడి పీడ విరగడ చేసిన మిత్రులిద్దరికీ కృతజ్ఞతలు తెలియజేసి, వాళ్ళు కోరిన దశమూలం ఓషధీ మొక్కలనిచ్చింది. ఇక మంత్రదండాన్ని ధ్వసం చేస్తే దిరసవంచపుర ప్రజలు తమ యధారూపాలు పొందగలరు. అయితే, అది ఆత్మరక్షణకు అవసరం అనీ, ఊరి పొలిమేర దాటాక ధ్వసం చేస్తాననీ కపర్ది చెప్పాడు.

ఆ తరవాత ఇద్దరూ వాయుశకటం దాచిన స్థలానికి బయలుదేరారు. ఊరి పొలిమేర దాటాక హేమానందుడు చెప్పినప్పటికీ, ''ఎప్పుడో సరదాగా నేర్చుకున్న ఇంద్రజాల విద్య మహాదంభుడి పొగరు అణచడానికి ఉపయోగపడింది. అలాగే ఇప్పుడు లభించిన ఈ మంత్రదండం మునుముందు ఉపయోగ పడగలదు,'' అంటూ దాన్ని విరచి వేయడా నికి కపర్ది నిరాకరించాడు. అయినా, వారు ఊరి పొలిమేర దాటగానే నగర ప్రజలు మామూలు రూపాలు పొందారు. వాయు శకటం నుంచి దానిని గమనించిన హేమానం దుడు సంతోషించాడు. ఆ తరవాత పర్వత




శ్రేణులను దాటి సంజీవరాయుడికి నివాళు లర్పించడానికి హేమానందుడు వాయుశక టాన్ని కిందికి దించాడు. అక్కడ సంజీవ రాయుడూ, శివనాదం ఉండడం చూసి పట్ట రాని ఆనందంతో వారిని కౌగిలించుకున్నాడు.

''ఆ వృద్ధుడు దయగలవాడు. మనసు మార్చుకుని నా యౌవనం నాకు తిరిగి ఇచ్చి వెళ్ళాడు,'' అన్నాడు సంజీవరాయుడు.

''సముద్రం నుంచి వేరే తీరం చేరడంవల్ల ఇక్కడికి రావడం ఆలస్యమయింది,'' అన్నాడు శివనాదం.

తరవాత నలుగురూ వాయుశకటంలో మాణిక్యపురి చేరుకున్నారు. కృపాళువు దశ మూలారిష్టం తయారు చేసి ఇవ్వడంతో ప్రత్యూష త్వరలో కోలుకున్నది. ప్రత్యూష, హేమానందుల వివాహం ఘనంగా జరిగింది.

ఆరోజు సాయంకాలం కపర్ది ఇంద్రజాల ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. ప్రజల నుంచి ప్రశంసలను, విలువైన కానుకలను ఆశించి కపర్ది ప్రదర్శన ప్రారంభిస్తూ, మహా దంభుడి మంత్రదండాన్ని ప్రయోగించ బోయాడు. అయితే, అది సహకరించ కుండా తిరగబడి అతణ్ణి చావగొట్టసాగింది. అవమానం పాలైన కపర్ది మంత్రదండాన్ని విరిచేసి, తలవంచుకుని వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, హేమా నందుడితో వెళ్ళిన కపర్ది మాంత్రికుణ్ణి ఓడించి, మూలిక సాధించడంలో అతనికి ఎంతో సాయ పడ్డాడు. మాంత్రికుడి మంత్రదండాన్ని చేజి క్కించుకున్నాడు. అయితే, ఆ మంత్రదండం అతనికి సహకరించకుండా ఎందుకు ఎదురు తిరిగింది? అద్భుత శక్తులను నమ్ముకుంటే అవి ఎప్పుడో ఒకప్పుడు నట్టేట ముంచు తాయనడానికి ఇది నిదర్శనం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మూలిక కోసం బయలుదేరిన హేమానందుడి కార్యసిద్ధికి అతడి వెంట వెళ్ళిన ముగ్గురూ సాయ పడ్డారు. ఆ విధంగా నలుగురూ కార్యసాధ కులే. నీట మునిగిపోతూన్న హేమానందుడికి తను పట్టుకున్న కొయ్యముక్కను అందించి మిత్రధర్మం పాటించాడు శివనాదం. నూతన ఔషధం ద్వారా మానవ జాతికి మేలు జరగా లని తన యౌవనాన్నే త్యాగం చేశాడు సంజీవి రాయుడు. మాంత్రికుణ్ణి నిర్వీర్యుణ్ణి చేయ డంలో కపర్ది కనబరచిన సమయస్ఫూర్తి, శక్తిసామర్థ్యాలు తక్కువేం కావు. అయితే, మంత్రదండం చేజిక్కాక అతనిలో స్వార్థం పెరిగి, ఆలోచనా విధానం పెడత్రోవ పట్టింది. తనది కాని మంత్రదండంతో తను లబ్ధి పొందా లని ఆశించాడు. మంత్రదండం అద్భుతశక్తి కలదేగాని అది మహాదంభుడి కంఠస్వర ప్రకం పనలకు మాత్రమే పనిచేస్తుంది. సాధించిన వాడికే తప్ప, తస్కరించిన వాడికి సహకరించదు. అందుకే అది ఎదురు తిరిగింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]








## విజేతకు ఉక్కు ఖడ్గం

గ్రీకు విజేత అలెగ్జాండర్, రాజు పురుషోత్తముడి మధ్య జరిగిన సంభాషణ సుప్రసిద్ధమైనది. అలెగ్జాండర్, ''నిన్ను ఎలా చూడాలి?'' అని అడిగితే, ''సాటి రాజులా చూడాలి,'' అని పురుషోత్తముడు జవాబిచ్చాడు అన్న సంగతి మన కందరికీ తెలిసినదే. అలెగ్జాండర్ స్వదేశానికి తిరిగి వెళ్ళడానికి ముందు పురుషోత్తముడు ఆయనకు ఉక్కుతో తయారైన ఖడ్గాన్ని కానుకగా అందజేశాడు. ఎందుకంటే ఆ కాలంలో ఉక్కు గురించి పాశ్చాత్య దేశాలకు తెలియదు. మన దేశంలో చాలా కాలం నుంచే గ్రామాలలో ఉక్కు తయారు చేసేవారని చెబుతారు!

## భారతదేశానికి తొలి అచ్చుయంత్రం

భారతదేశంలో అచ్చయిన తొలిపుస్తకం 450 సం.లకు పూర్వం నవంబర్ 6వ తేదీ ఆవిష్కరించబడింది. ఈ చారిత్రక సంఘటన ఆధారంగా 2006లో జరిగిన 'ఫ్రాంక్‌ఫర్ట్ వరల్డ్ బుక్ ఫెయిర్'లో ఇండియాను 'గెస్ట్ ఆఫ్ ఆనర్'గా సత్కరించారు. భారతదేశంలోని క్రిస్టియన్ మిషనరీలు ఇక్కడ మాట్లాడే పలుభాషలలో పవిత్ర బైబిల్‌ను తీసుకురావాలని ఆశించారు. 1952లో స్పెయిన్ నుంచి వచ్చిన ఫ్రాన్సిస్ జేవియర్ అనే ఒక మిషనరీ తమిళనాడులోని తరంగం బాడిలో బైబిల్‌ను బోధించేవాడు. ఆయన భారతదేశానికి ఒక అచ్చుయంత్రాన్ని పంపమని స్పెయిన్ రాజును అభ్యర్థించాడు. అప్పటికే కొందరు జేస్యూట్ మిషనరీలు తీసుకువచ్చిన యంత్రాలు గోవాలో ఉన్నాయి. మన పశ్చిమతీరంలో మాట్లాడే కొంకణి భాషలో బైబిల్ 1556వ సం.లో అచ్చయింది. ప్రపంచంలో అచ్చుయంత్రాన్ని ప్రవేశపెట్టిన రెండవ దేశం మనది.



## నాకు నచ్చిన కథ-9



దాదాపు ఇరవైయేళ్ళ క్రితం 'నాకు నచ్చిన కథ' శీర్షిక కోసం చందమామ కథను అడిగినప్పుడు, "నాకు చాలా ఇష్టమైన, పిల్లలతో పంచుకోవడానికి ఎంతో ముచ్చటపడే ఈ చిన్న కథను పంపుతున్నాను," అని రాశారు డా. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ. సుప్రసిద్ధ కవయిత్రి సరోజినీనాయుడు గారి సోదరుడైన హరీంద్రనాథ్ చటోపాధ్యాయ చక్కని నటుడు, చిత్రకారుడు, మంచి వక్త. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన హరీంద్రనాథ్ చటోపాధ్యాయను మామూలు డిగ్రీ లేకపోయినప్పటికీ కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం పిహెచ్‌డి చేయడానికి అనుమతించింది. "లైఫ్ అండ్ మైసెల్ఫ్"తో సహా ఆయన ఎన్నో గ్రంథాలు రచించారు. 1973లో పద్మభూషణ్ పురస్కారంతో సత్కరించబడ్డారు.

'నాకు నచ్చిన కథ' శీర్షికలో మరో ప్రముఖుడి సరికొత్త కథను అందించే ముందు ఈనాటి యువతరానికి ఆ సుప్రసిద్ధ రచయిత కలం నుంచి జాలువారిన కథను అందజేయడానికి సంతోషిస్తున్నాము. -సం.

# ప్రపంచంలోకెల్లా చాలా అందమైన స్త్రీ!

సువిశాల వినీల ఆకాశం కింద ప్రశాంతమైన పల్లెటూరు. పల్లెటూరి చుట్టూ పరచుకున్న పచ్చటి వరి పొలాలు. అల్లనల్లన గాలులు వీస్తుంటే మురిసిపోయిన వరిపొలాలు తమ పచ్చదనం అందమా? ఆకాశం నీలి రంగు అందమా? అని పోల్చి చూసుకుంటున్నట్టు కనిపిస్తున్నాయి!

ప్రకృతి అందమైనదే. అయినా పొలాల్లో చెమటోడ్చి కాయకష్టం చేసే రైతులకు పంటలు పండించడంలో సాయపడకపోతే, అది అందం అనే మాట అర్థాన్ని కోల్పోయి ఉండేది. పంటలు పండడానికి ఒక్క వర్షం మాత్రమే ప్రధానమని అనుకోకండి పిల్లలూ. మన రైతులు శ్రమతో నుదుటి నుంచీ, వీపులు, వక్షస్థలాలు, కణతుల నుంచీ జార్చే చెమట ధారలను మరిచిపోకూడదు. వాళ్ళు పడే శ్రమకు తప్పక ఫలితం లభించాలి.

సరే, దాన్ని గురించి తరవాత నింపాదిగా మాట్లాడుకుందాం. ఇప్పుడు ప్రతి చిన్నారీ చదివి ఆనందించి, ఎన్నటికీ మరిచి పోలేని చక్కటి కథ ఒకటి చెబుతాను.

పొలంలో రైతులాగే ఆకాశంలో రోజంతా కష్టపడి పనిచేసిన సూర్యుడు అస్తమిస్తున్నాడు. రోజంతా ఆకాశంలో శ్రమపడి, అరుదైన నక్షత్రాల పంటను పండించే ఒంటరి రైతు సూర్యుడు అని చెప్పవచ్చు! సూర్యుడు అస్తమిస్తూన్న సమయంలో పురుషులూ, స్త్రీలూ అయిన రైతులు మైత్రీసహకారంతో విత్తి, పెంచి, పండించిన పంటను, ధాన్యాలను తలల మీదికి ఎత్తు

కుని పొలాలనుంచి ఇళ్ళకు తిరుగు ప్రయాణమవుతున్నారు. వాళ్ళవెంట కొందరు చిన్న పిల్లలు కూడా ఉన్నారు. కొందరు పిల్లలు సంతోషంగా తల్లులకు హత్తుకుని ఉన్నారు. మరికొందరు తల్లుల వెంట నడుస్తున్నారు.

అయితే, ఒక పిల్లవాడు మాత్రం సీతాకోక చిలుకలను తరమడంలో నిమగ్నమైపోయాడు. వాటిని చూస్తే ఎవరికి మాత్రం సంతోషం కలగదు? కొన్ని సీతాకోక చిలుకలకు తెల్లటి చుక్కలతో పొడవాటి నల్లటి రెక్కలున్నాయి. మరి కొన్ని నారింజ తెలుపువి. ఇంకా కొన్నయితే తెల్లటి చుక్కలతో ఎర్రగా ఉన్నాయి. ఎంతటి అద్భుతమైన ప్రాణి సీతాకోకచిలుక! అది రెపరెపలాడే అందమైన పద్యం! ఎగిరే పువ్వు! అలాగే పువ్వును ఎగరలేని సీతాకోకచిలుక అని చెప్పవచ్చు!

పొలాలకు కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న తమ గుడిసెలకు రైతులు తిరిగివెళుతున్నారు. ఎంత దూరమైనా సరే పేదరైతులు నడిచే వెళతారు. వాళ్ళ పాదాల స్పర్శ లేకుండా బాటలు సుఖంగా, సంతోషంగా ఉండలేవు!

సీతాకోకచిలుకలను తరుముతూన్న పసివాడు ఉన్నట్టుండి తన తల్లికి దూరమైపోయినట్టు గ్రహించి ఉలిక్కిపడ్డాడు. ''అమ్మా! అమ్మా!'' అంటూ గట్టిగా పిలవసాగాడు. కాని అప్పటికే చాలా దూరం ముందుకు వెళ్ళి పోవడంతో ఆమెకు కొడుకు పిలుపు వినిపించలేదు. పైగా సూర్యుడు పూర్తిగా అస్తమించడంతో చీకటి అలముకోసాగింది.

పిల్లవాడి, ''అమ్మా, అమ్మా!'' అనే అరుపులతో గాలి ప్రతిధ్వనించసాగింది. బాట ఒంటరిగా ఉంటోంది. పొలాలు ఒంటరిగా ఉన్నాయి. పరిసరాలన్నీ ఒంటరిగానూ, నిశ్శబ్దంగానూ ఉన్నాయి.

అదృష్టవశాత్తు ఎదుటి వైపునుంచి చామన ఛాయతో దృఢకాయుడైన ఒక రైతు వచ్చాడు. ''ఎందుకు ఏడుస్తున్నావు, నాయనా!'' అని అడిగాడు ఆ రైతు. తప్పక సాయపడతాను అన్న ఆదరం ఆయన కంఠస్వరంలో వినిపించింది.

''నాకు మా అమ్మ కావాలి!'' అంటూ ఏడ్వసాగాడు పిల్లవాడు.



Statement about Ownership of
**CHANDAMAMA (Telugu)**
Rule 8 (FormVI), Newspaper
(Central) Rules, 1956

1. **Place of Publication**
   JVL Plaza, Block-A, 6th Floor
   626, Anna Salai, Teynampet
   Chennai-600018
2. **Periodicity of Publication**
   MONTHLY
   1st of each calendar month
3. **Printer's Name**
   B. VISWANATHA REDDI
   **Nationality**
   INDIAN
   **Address**
   JVL Plaza, Block-A, 6th Floor
   626, Anna Salai, Teynampet
   Chennai-600018
4. **Publisher's Name**
   B. VISWANATHA REDDI
   **Nationality**
   INDIAN
   **Address**
   JVL Plaza, Block-A, 6th Floor
   626, Anna Salai, Teynampet
   Chennai-600018
5. **Editor's Name**
   B. VISWANATHA REDDI
   (Viswam)
   **Nationality**
   INDIAN
   **Address**
   JVL Plaza, Block-A, 6th Floor,
   626, Anna Salai, Teynampet,
   Chennai-600018
6. Name and Address of individuals who own the newspaper
   **Chandamama India Ltd.**
   Board of Directors:
   1. Kiran Kulkarni
   2. Prashant Mulekar
   3. B. Viswanatha Reddi
   JVL Plaza, Block-A, 6th Floor
   626, Anna Salai, Teynampet
   Chennai-600018

*I,* **B. Viswanatha Reddi,** *do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

**(Sd.) B. VISWANATHA REDDI**
1st March 2008 *Publisher*

''మీ అమ్మ ఎలా ఉంటుంది?'' అని అడిగాడు రైతు.

''చాలా అందంగా ఉంటుంది,'' అన్నాడు పిల్లవాడు.

''ఏడవొద్దు. మీ అమ్మను నేను తీసుకువస్తాను,'' అన్నాడు రైతు.

అంతలో ఒక అందమైన స్త్రీ అటువైపుగా వస్తూ కనిపించింది.

''ఇదా మీ అమ్మ? చాలా అందంగా ఉంది,'' అన్నాడు రైతు.

''కాదు, కాదు. మా అమ్మ ఈ ప్రపంచంలోకెల్లా చాలా అందమైన స్త్రీ!'' అన్నాడు పిల్లవాడు.

ఆ తరవాత మరొక స్త్రీ అటుకేసి వచ్చింది. ''అదా మీ అమ్మ?'' అని అడిగాడు రైతు.

''కాదు, కాదు. మా అమ్మ చాలా అందంగా ఉంటుంది. ప్రపంచంలో అందరికన్నా చాలా అందంగా ఉంటుంది,'' అంటూ ఏడ్వసాగాడు పసివాడు.

తరవాత ఒకరి వెనక ఒకరుగా చాలా అందమైన స్త్రీలు అటువైపు వచ్చారు. వాళ్ళందరినీ చూసినా వారిలో ఎవరూ తన తల్లి కాక పోయేసరికి పసివాడు పట్టరాని దుఃఖంతో ఏడ్వసాగాడు. ఇక తన తల్లిని చూడలేనేమో అన్న భయం వాడికి పట్టుకున్నది.

అయినా, పరిపూర్ణంగా విశ్వసిస్తే ప్రేమ ఫలిస్తుంది.

కొద్ది దూరంలో తన తల్లి రావడం కనిపించగానే పట్టరాని ఆనందంతో అరుస్తూ వెళ్ళి, ఆమె కాళ్ళను చుట్టుకుని, ''ఇదీ మా అమ్మ! మా అమ్మ వచ్చింది! ఆహా, వచ్చేసింది,'' అన్నాడు పిల్లవాడు.

చామనఛాయ రైతుకు నవ్వాగ లేదు. అతడి నవ్వు విని భూలోకంలో ఏం జరిగిందా అని ఆకాశంలోని దేవతలు విస్తుపోయారు.

ఆ పిల్లవాడి తల్లి అతి సామాన్యమైన పేద రైతుమహిళ. ఆమెకు ఒక కన్నుకూడా లేదు. ఆమె ముఖం ఎండకు కమిలి పోయి నల్లగా ఉంది.

''ఇదా మీ అమ్మ? ఈమె ప్రపంచంలోకెల్లా చాలా అందమైన స్త్రీయా?'' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నవ్వసాగాడు రైతు.

''అవును. ఈమె ప్రపంచంలోకెల్లా చాలా అందమైన స్త్రీ–మా అమ్మ,'' అన్నాడు పిల్లవాడు. వాడికంఠస్వరంలో పసిప్రాయపు వసంత పుష్పాలన్నీ ఇమిడి ఉన్నట్టు అనిపించింది!




## 20వ యేట డాక్టరేట్

తథాగత్ అవతార్ తులసి అనే 20 ఏళ్ళ అసమాన ప్రతిభాశాలి అయిన యువకుడు బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ నుంచి డాక్టరేట్ అందుకోనున్నాడు. ఆ విద్యాసంస్థ నుంచి పిహెచ్‌డి అందుకుంటూన్న అతి పిన్న వయస్కుడు అతడే. అతడు పదేళ్ళలో బి.యస్‌సి డిగ్రీని, పన్నెండేళ్ళలో ఎం.ఎస్‌సి డిగ్రీని అందుకున్నాడు. అతణ్ణి మూడేళ్ళ ప్రాయంలో బడిలో చేర్పిస్తే వెళ్ళనని మొండికెత్తాడట. ఎందుకో తెలుసా? అప్పటికే అతనికి ఆ పాఠ్యాంశాలన్నీ పూర్తిగా వచ్చు! అతనికి అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉన్నది. వేగంగా చదవగలడు. ఢిల్లీలో మొదట స్కూలుకు వెళ్ళినప్పుడు అతడి వయసు ఎనిమిదేళ్ళు. 6వ తరగతిలో చేర్చుకోబడ్డాడు. అదే సమయంలో 7వ తరగతి నుంచి 10వ తరగతి పాఠ్యపుస్తకాలన్నిటినీ సునాయాసంగా చదివేశాడు. 1997లో పదవ తరగతి పూర్తి చేసేప్పుడు అతడి వయసు 10 సంవత్సరాలు మాత్రమే.

## టేకు దుంగతో ధ్వజస్తంభం

కేరళలోని ఎట్టుమనూర్ మహాదేవ ఆలయంలో నూతన ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించనున్నారు. అందుకోసం ఒక టేకు చెట్టును పడగొట్టారు. అలా నరికి పడగొట్టినప్పుడు చెట్టు నేలకు తగలకుండా తగు జాగ్రత్తలు తీసుకున్నారు. అందుకు క్రేన్లను ఉపయోగించారు. 200 సం.ల నాటి ఆ చెట్టుకు మొదట ఆగమ శాస్త్రోక్తంగా పూజలు నిర్వహించారు. ఆ ధ్వజస్తంభాన్ని తయారుచేసే వడ్రంగుల పెద్ద ఈ పూజాతతంగాలను పూర్తి చేసి, కలశపూజ జరిపి, చెట్టును నరకడానికి వృక్షరాజు అనుమతి పొంది, చెట్టును నరికేవాడికి గొడ్డలిని అందించాడు. అతడు తూర్పుకు అభిముఖంగా ఉన్న వేళ్ళను మొదట నరికాడు. ఈ పని పూర్తికావడానికి సాయంకాలమయింది. ఆ తరవాత దుంగను ఊరేగింపుగా ఆలయ ప్రాంగణానికి తీసుకువెళ్ళారు.





# అర్ధరాత్రి

నారాయణపురంలోని భూస్వామి వెంక టాద్రి కొడుకు సింహాచలం తెలివైనవాడే గాని పరమ బద్ధకస్తుడు. ''కూర్చుని తింటే కొండ లయినా కరిగిపోతాయి. చెమటోడ్చి కష్టపడక పోయినా, దగ్గరుండి పనులు చేయించవచ్చు కదా,'' అని తండ్రి ఎంత చెప్పినా సింహాచలం పొలంకేసి వెళ్ళేవాడు కాడు. బలవంతం మీద వెళ్ళినా పనులు చేసేవాళ్ళను అడ్డదిడ్డమైన ప్రశ్నలడిగి తికమక పెడుతూ పనులు చెడ గొట్టేవాడు. ఊళ్ళో కనిపించినవారినల్లా అర్థం పర్థం లేని ప్రశ్నలడిగి విసిగించేవాడు. అందు వల్ల సింహాచలాన్ని చూడగానే గ్రామ ప్రజలు పక్కకు తప్పుకోవడం మొదలుపెట్టారు.

ఒకసారి దూరంలోని రాజవరంలో జాతర జరుగుతూంటే చూద్దామని పాలేరు మార న్నను వెంటబెట్టుకుని వెళ్ళాడు సింహాచలం. వినోదాల్లో పడి సమయం మరిచిపోవడంతో అక్కడే చీకటిపడింది. ఇద్దరూ తిరుగు ప్రయా ణమై త్వరగా ఊరుచేరాలన్న తొందరలో దారి తప్పారు. వెనక్కు తిరగాలన్నా కటిక చీకటి. ఏం చేయాలో పాలుపోకచూస్తూంటే, దూరంగా మిణుకు మిణుకుమంటూ వెలుతురు కనిపించింది. అతి ప్రయాసతో వాళ్ళు ఆ వెలుతురును సమీపించారు. అక్కడ ఒక గుడిసెలో బైరాగి కనిపించాడు. ఆయన్ను చూడగానే సింహాచలం, ''జన సంచారం లేని ఈ అడవి ప్రాంతంలో ఒంటరిగా ఏం చేస్తు న్నావు? ఊరికి దూరంలో ఉన్నంత మాత్రాన బాధలు దూరమై పోతాయా? ఇక్కడ తిండికే కష్టం కదా? నువ్వు నిజంగానే బైరాగివా లేక సంసార బాధలు భరించలేక పారిపోయి వచ్చావా? కొంపదీసి నేరాలు చేసి పారిపోయి రాలేదు కదా!'' అంటూ తన అలవాటు ప్రకారం అనేక ప్రశ్నలు అడిగాడు.

ఎన్. శివనాగేశ్వరరావు

బైరాగి చిన్నగానవ్వి, ''బాగా అలిసిపోయి ఉన్నావు. ఇప్పుడు ఈ అరటిపండు తిని ప్రశాంతంగా నిద్రపో నాయనా. తెల్లవారాక నీ అనుమానాలన్నీ తీరుస్తాను,'' అంటూ ఒక పండు ఇచ్చాడు.

సింహాచలం దాన్ని తిని, గుడిసెలో పడుకు న్నాడు. పాలేరు అతడికి కొంచెం పెడగా పడుకుని నిద్రపోయాడు.

అంతలో సింహాచలానికి పొడవాటి చెట్లు బోలెడు కనిపించాయి. అంతే కాదు. అక్కడ పట్టపగలులా వెలుతురు ఉంది. సింహా చలం వడివడిగా వెళ్ళి ఆ ప్రాంతం చేరాడు. అతణ్ణి చూడగానే కొందరు పొడవాటి మను షులు చెట్లపై నుంచి కిందికి గబగబా దిగి వచ్చి అతని చుట్టూమూగారు. వారిలో ఒకడు సింహాచలానికి నమస్కరించి, ''అయ్యా, నా పేరు మర్రయ్య. ఎంతో కాలానికి మా ఊరు వచ్చిన అతిథి మీరు. సూరీడు పల్లె తరపున స్వాగతం పలుకుతున్నాం. మా ఆతిథ్యం స్వీకరించండి,'' అన్నాడు.

''మీరు చెట్లపైనుంచి దిగారు కదా. మరి మీ ఇళ్ళెక్కడ?'' అని అడిగాడు సింహాచలం.

''మా ఊళ్ళో ఇళ్ళు చెట్లమీదఉంటాయి,'' అని పైకి చూపించాడు మర్రయ్య.

తలెత్తి చూసిన సింహాచలానికి పొడవైన చెట్ల మీద అందమైన పెంకుటిళ్ళు కనిపిం చాయి. వాటిని చూసి ఆశ్చర్యపోయిన సింహా చలం, ''నాకు తెలిసి ఇది అర్ధరాత్రి. మరి మీ ఊళ్ళో పట్టపగలుగా ఉంది. ఏమిటీ విడ్డూరం?'' అని అడిగాడు.



అందుకు వేపయ్య అనే పొడగరి, ''మాది సూరీడు పల్లె. ఇక్కడ సూర్య అస్తమయం అంటూ ఉండదు. మా పల్లెకు వచ్చిన వారికి చక్కని ఆతిథ్యం ఇవ్వాలనీ, ఎప్పుడో పెద్దలు ఏర్పరచుకున్న కొన్ని నియమాలను విధిగా పాటించాలనీ, లేకుంటే సూర్యుడు మాయమై మాది శాశ్వతంగా చీకటిపల్లెగా మారి పోతుం దనీ మా పూర్వీకులు చెప్పారు. అందుకే అతిథుల కోసం ప్రత్యేకంగా అందమైన చక్కని అతిథిగృహం కూడా నిర్మించాం,'' అన్నాడు.

''ఆ అతిథిగృహమైనా నేల మీద ఉందా? అదీ చెట్టుపైనేనా?'' అని అడిగాడు సింహా చలం.

''దాన్ని మిగతా వాటికన్నా మరీ ఎత్తున కట్టాం,'' అని మద్దయ్య అనేవాడు సింహా



మార్చి, మా అందరికీ వంటలు చేయి స్తూంటాం,'' అన్న గంధమయ్య అనే మనిషి మాట విని అతడు ఉలిక్కిపడ్డాడు.

అంతలో కింద కోలాహలం వినిపించి సింహాచలం తొంగి చూశాడు. అక్కడ చాలా మంది నృత్యాలు చేస్తున్నారు.

''చాలా కాలానికి అతిథిగా నువ్వొచ్చావు గనక, మా వాళ్ళు ఆనందంతో పండుగ చేసు కుంటున్నారు,'' అన్నాడు మల్రయ్య.

కింద ఉన్నవాళ్ళు సింహాచలాన్ని కిందికి రమ్మని ఉత్సాహంతో చేతులు ఊపారు. సింహాచలం మళ్ళీ కాళ్ళకు చక్రాలు కట్టు కుని కిందికి దిగాడు. అక్కడున్నవాళ్ళు వెదురు పాత్రలలో ఉన్న రసం తాగుతూ, ఒక పాత్ర సింహాచలానికి అందించారు. ఆ రసం రుచి చూసిన సింహాచలం, ''చాలా బావుంది. ఏం పానీయం ఇది? అవునూ, ఈ పానీ యాన్ని పాత్రలలో నింపుతూన్న ఆ ఇద్దరూ మౌనంగా విచారంతో ఉన్నారెందుకు?'' అని అడిగాడు వాళ్ళను చూపుతూ.

''ఆ ఇద్దరు మౌనస్వాములే ఐదు రకాల మధుర ఫలరసాలతో కొండతేనె కలిపి ఈ అద్భుత పానీయం తయారు చేశారు. అర్థం పర్థం లేని ప్రశ్నలతో మమ్మల్ని విసిగించే వారిద్దరి నాలుకలూ కత్తిరించి మరిక ప్రశ్నలు వేయకుండా పానీయం తయారుచేసే పని అప్పగించాం. అలాంటి వారికి మేము విధించే శిక్ష ఇదే!'' అన్నాడు చింతయ్య అనే పొడగరి.

సింహాచలం భయకంపితుడయ్యాడు. అంతలో నిప్పులవాన ఆరంభం కావడంతో

చలానికి సరివి చెట్టుపైనున్న అతిథిగృహం చూపించాడు.

''నాకు చెట్టెక్కడం రాదు,'' అన్నాడు సింహాచలం.

''ఆ సంగతి మేము చూసుకుంటాం,'' అంటూ వాళ్ళు సింహాచలం కాళ్ళకు చక్రాలు కట్టారు. అంతే. సింహాచలం గిరగిరా తిరుగుతూ చెట్టుపైనున్న అతిథిగృహం చేరాడు. అతడి వెనకనే తక్కిన వారందరూ అక్కడికి చేరి, అతిథిగృహంలో వెదురుబొంగు లతో తయారు చేసిన అందమైన సింహాసనం మీద సింహాచలాన్ని కూర్చోబెట్టారు.

అక్కడున్న రాళ్ళ పొయ్యి చుట్టూ ఒక నల్ల పిల్లి అటూ ఇటూ తిరుగుతూ కనిపించింది. ఆ పిల్లివంక వింతగా చూస్తూన్న సింహా చలంతో, ''బద్ధకస్తులను నల్లపిల్లులుగా

అందరూ పట్టరాని ఆనందంతో నాట్యం చేయసాగారు.

''నువ్వు రావడం వల్లనే ఈ నిప్పులవాన కురుస్తోంది. మేము నీకెంతో రుణపడి ఉన్నాం. ఏం కావాలో కోరుకో. తప్పక తీరుస్తాం,'' అన్నాడు మర్రయ్య.

''నన్ను వెంటనే మా ఊరు చేర్చండి. అది చాలు. లేకుంటే ఏదో ఒక చెట్టుకు ఉరిపోసు కుంటాను,'' అన్నాడు సింహాచలం.

''అంతపని చెయ్యకు. నువ్వు కోరినట్టే మీ ఊరు పంపుతాం,'' అంటూ నలుగురు పొడగరులు సింహాచలాన్ని ఎత్తిపట్టుకుని గిరగిరా తిప్పి విసిరివేశారు.

సింహాచలం గాలిలో పల్టీలు కొడుతూ, ''కాపాడండి, కాపాడండి,'' అని బిగ్గరగా అరవసాగాడు.

పక్కనే పడుకున్న పాలేరు మారన్న సింహాచలాన్ని తట్టి లేపుతూ, ''ఏమిటి బాబూ, ఏదైనా కలగన్నావా?'' అని అడిగాడు.

కళ్ళు తెరిచిన సింహాచలం, ''అవును, కలే!'' అన్నాడు గాఢంగా నిట్టూరుస్తూ.

ఆ తరవాత అతనికి నిద్రపట్టలేదు. గుడిసె నుంచి వెలుపలికి వచ్చాడు. వణికించే చలిలో శరీరం మీద ఎలాంటి అచ్ఛాదనా లేకుండా ఒంటి కాలిపై నిలబడి ధ్యానం చేస్తున్న బైరాగిని చూసి, విస్తుపోయాడు. తెల్లవారు తూండగా కళ్ళు తెరిచిన బైరాగి కాళ్ళపై బడి మొక్కాడు సింహాచలం.

బైరాగి అతణ్ణి మందహాసంతో లేవనెత్తుతూ, ''నీ సందేహాలకు సమాధానాలు లభించాయా నాయనా?'' అని అడిగాడు.

సింహాచలం అవునన్నట్టు తలూపాడు.

''కాలం దైవస్వరూపం. బద్ధకం పరమ నీచ స్వభావం. అనవసరమైన వాచాలతతో కాలాన్ని వృథా చేయకుండా సద్వినియోగం చేసుకో,'' అని దీవించాడు బైరాగి.

పాలేరుతో కలిసి ఇంటికి తిరిగి వచ్చిన సింహాచలం, ఆరోజు నుంచి కనిపించినవారిని అడ్డమైన ప్రశ్నలతో వేధించడం మానేశాడు. బద్ధకం వదిలి కష్టపడి పని చేస్తూ, తండ్రి చెప్పినట్టు నడుచుకుంటూ అందరిచేతా ప్రయోజకుడనిపించుకున్నాడు.



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (27)

# మార్క్‌ట్వైన్ దిద్దుబాటు చర్య

మార్క్‌ట్వైన్ పేరుతో ప్రసిద్ధుడైన రచయిత అసలు పేరు శామ్యుయల్ లాంగోర్న్ క్లెమెన్స్ (1835-1910). ది అడ్వంచర్స్ ఆఫ్ టామ్‌సాయెర్, ది అడ్వంచర్స్ ఆఫ్ హకిల్ బెర్రిఫిన్ లాంటి సుప్రసిద్ధ గ్రంథాలను రచించిన ఈ అమెరికన్ రచయిత చతురోక్తులకు, చర్యలకు పేరొందినవాడు.

రచయితగా తన ప్రాంతంలో కూడా నలుగురికి తెలియని తొలి రోజుల్లో ఆయన ఇంటి పక్కనే ఒక గొప్ప ధనవంతుడు ఉండేవాడు. ఆయన దగ్గర మంచి గ్రంథాలయం ఉండేది.



గ్రంథాలయం నుంచి చదివి ఇవ్వడానికి అరువుగా ఇవ్వమని ఒకటి రెండు పుస్తకాలను మార్క్‌ట్వైన్ ఆయనన్ను అడిగాడు. అందుకాయన, "నీకు నచ్చిన పుస్తకాన్ని నీకు కావలసినప్పుడు అరువివ్వడానికి నాకెలాంటి అభ్యంతరం లేదు. అయితే, దాన్ని నువ్వు ఇక్కడే కూర్చుని చదువుకోవాలి. పుస్తకాలను వెలుపలికి తీసుకు వెళ్ళడం నాకు ఇష్టం ఉండదు. ఈ నియమాన్ని నేను కఠినంగా అనుసరిస్తాను," అన్నాడు.

ఆ నిబంధన మార్క్‌ట్వైన్‌కు నచ్చలేదు. కృతజ్ఞత తెలియజేసి అక్కడి నుంచి వెనుదిరిగి వచ్చేశాడు.

కొన్ని నెలలు గడిచాక ఒకనాడు పక్కింటి ధనికుడు మార్క్‌ట్వైన్ వద్దకు వచ్చి, "మా లాన్-మోవర్ పని చేయడం లేదు. మీ లాన్-మోవర్‌ను అరువిస్తావా?" అని అడిగాడు.

"మీకు కావలసినప్పుడు దాన్ని తీసుకెళ్ళవచ్చు. నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. అయితే, దాన్ని మీరు నా లాన్స్‌లోనే ఉపయోగించాలి. దాన్ని వెలుపలికి తీసుకెళ్ళడం నాకు ఇష్టం ఉండదు. ఈ నియమాన్ని కఠినంగా అనుసరిస్తున్నాను," అన్నాడు మార్క్‌ట్వైన్.

చాలా మంది మార్క్‌ట్వైన్‌కు ఈ ఉదంతాన్ని ఆపాదిస్తూ ఉంటారు. కాని, ఇది నిజమా, కాదా అన్నది తెలియదు. అయితే, ఇప్పుడు చెప్పబోయే సంఘటన మాత్రం యదార్థమైనది. ఆ గొప్ప రచయిత కాస్త విపరీత మనస్తత్వం

కలవాడని కూడా ఈ ఉదంతం తెలియజేస్తుంది. 'అంకుల్ టామ్స్ క్యాబిన్' రచించిన సుప్రసిద్ధ రచయిత్రి మిస్సర్స్ హారియట్ బీచర్ స్టోవ్‌ను చూడ్డానికి ఆయన ఒకసారి వెళ్ళాడు. ఇంటికి తిరిగి వచ్చాక ఆయన్ను పరిశీలనగా చూసిన ఆయన భార్య మనస్తాపంతో ముభావంగా ఉండడం గమనించి, ''ఏమిటి సంగతి?'' అని అడిగాడు మార్క్‌ట్వైన్.

''అంత అమర్యాదకరంగా దుస్తులు ధరించి వెళతారా?'' అని అడిగింది భార్య.

మార్క్‌ట్వైన్ అద్దం ఎదుట నిలబడి, తన దుస్తులను పరిశీలనగా చూసుకున్నాడు. అయితే, తన దుస్తులలో ఏం లోపం ఉందో, అమర్యాదకరమైనదేదో ఆయనకు ఏమాత్రం అర్థంకాలేదు. తన దుస్తుల్లో వాటిల్లిన లోపం ఏమిటో కాస్త దాపరికం లేకుండా చెప్పమని భార్యను చూపులతోనే అడిగాడు.

'నెక్‌టై లేకుండా ఆ విదుషీమణిని చూడడానికి వెళ్ళవచ్చా? మిమ్మల్ని గురించి ఆమె ఏమనుకుంటుంది?'' అన్నది భార్య.

మార్క్‌ట్వైన్ ఆ తరవాత మాట్లాడలేదుగాని, దేన్నో ప్యాక్ చెయ్యడంలో నిమగ్నుడైపోయాడు. ఆ తరవాత మనిషి కోసం ఎదురు చూడసాగాడు. ఆ తరవాతే, భార్యకు ఆయన చేసిన పనేమిటో తెలియవచ్చింది. ఆయన తన నెక్‌టైని ఒక



కవర్‌లో పెట్టి ఈ సందేశంతో మిస్సర్స్ స్టోవ్‌కు పంపాడు: ''నెక్‌టై లేకుండా నేను మిమ్మల్ని కలుసుకోవడం నా భార్యకు మనస్తాపం కలిగించింది. ఆ అమూల్యమైన వస్తువు ఇందులో ఉన్నది. నేను మీతో అరగంటసేపు ఉన్నానను కుంటాను. అంతసేపు దీనిని మీరు చూసి దయచేసి నాకు వెనక్కు తిప్పి పంపండి. ఎందుకంటే నాకున్నది ఇదొక్కటే. అంతవరకు దీనిని తీసుకువచ్చిన మనిషి అక్కడే ఉంటాడు. నన్ను మర్యాదస్థుణ్ణి చేయడంలో మీరు అందిస్తూన్న సహకారానికి కృతజ్ఞతలు.'' -(ఎం.డి)

**చందమామ ఇండియా క్విజ్ - 12 (జనవరి '08)**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.

అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.

## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-6

# తప్పించుకున్న వృషభరాజు!

చాలా కాలం క్రితం ఒక వర్తకపు ఓడ సరుకులతో స్వదేశానికి తిరిగి వెళుతున్నది. మితంగా వీచే సముద్రపుగాలులతో వాతావరణం ఎంతో ప్రశాంతంగా ఉన్నది. హఠాత్తుగా వందలాది చిన్న పడవలు ఓడను చుట్టుముట్టాయి. నావికులు విస్మయం చెందారు. వాళ్ళు ఏం జరుగుతున్నదీ గ్రహించేలోపలే పడవలలోని వాళ్ళు బిలబిలా ఓడలోకి ఎక్కివచ్చి అందిన వాటిని అందినట్టు దోచుకుని పడవలలోకి దూకి రెప్పపాటులో కనుమరుగైపోయారు. ''ఏం జరిగింది!'' అంటూ దిక్కు తోచక చూస్తూ వ్యాపారులు విస్తుపోయారు!

ప్రాచీన కాలంలో కళింగరాజ్యంగా ప్రసిద్ధి గాంచిన ఈనాటి ఒరిస్సా ప్రాంతంలో బ్రిటిష్ వాళ్ళు 17వ శతాబ్దంలో వ్యాపార కేంద్రాన్ని నెలకొల్పారు. అయితే, తీరప్రాంతంలోని ఒక చిన్న రాజ్యాన్ని పాలించే రాజుకు పరాయి వ్యాపారులు వచ్చి తమ రాజ్యంలోని విలువైన వస్తువులను, నిధులను పట్టుకు పోవడం ఏమాత్రం నచ్చలేదు. ఒక మారు కాదు; రెండు మార్లు కాదు; అనేక పర్యాయాలు బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వర్తక ఓడలను ఆయన అనుచరులు పడవల్లో వచ్చి దోచుకువెళ్ళారు.

ఇది ఇంగ్లీషు వర్తకులకు కంటక ప్రాయమయింది. సంపన్నమైన భారతదేశంలోని ఈ భూభాగంలో వర్తక వ్యాపారాలు నెలకొల్పాలన్న తమ ప్రయత్నాలకు తరచూ అవరోధాలు ఏర్పడడం భరించలేకపోయారు. ఈ అవరోధాలను అధిగమించాలంటే వాటిని కల్పిస్తూన్న ఆ పాలకుణ్ణి ఎలాగైనా పట్టుకోవాలని నిర్ణయించారు. అయితే ఆ పాలకుడు ఎవరు? ఎక్కడ ఉంటాడు? ఎవరికీ ఇదమిత్థంగా తెలియదు!

సముద్ర తీరంలో రకరకాల జంతువులతో నిండిన దట్టమైన అడవులతో పరివేష్ఠించబడిన అందమైన పారాదీప్ అనే చిన్న ద్వీపం ఉండేది. కుజాంగ్ అనే చిన్న రాజ్యానికి రాజధాని అది. ఒక వైపున బంగాళాఖాతం, మిగిలినవైపుల మహానది, దాని ఉపనది దానికి హద్దులుగా ఉండేవి. ప్రకృతి సౌందర్యం నిండిన ఈ ప్రశాంత ప్రదేశంలో చంద్రధ్వజ రాజుగారి భవనం ఉండేది. ఆ రాజే సాహసవంతులైన పడవవీరులకు యుద్ధ విద్యలలో శిక్షణనిచ్చేవాడు. వాళ్ళే ఆ ద్వీపం సమీపంలో వెళ్ళే బ్రిటిష్ వర్తక ఓడలను దోచుకుని నానా



బీభత్సం సృష్టించేవారు.

చంద్రధ్వజుడికి షాంధారాజా (వృషభరాజు) అనే మరో వింత బిరుదనామం కూడా ఉండేది. ఆయనకా బిరుదు రావడానికి ఒక ఉదంతాన్ని చెబుతారు. ఒకప్పుడు కుజాంగ్ రాజు పవిత్ర పూరీ నగరానికి వెళ్ళాడట. నగర వీధిలో నడిచి వెళుతూం డగా, ఆయన ధరించిన రంగుల దుస్తులను చూసి ఒక ఆబోతు ఆయన మీదికి ఉరక బోయింది. రాజు చుట్టూవున్న పరివారంలోని ప్రముఖులూ, భటులూ బెదిరిపోయి పక్కకు పారిపోయారట. అయితే, వారిలో రాజవంశా నికి చెందిన ఒక యువకుడు మాత్రం రాజును తనతండ్రిలా భావించి–ఉరుకుతూన్న ఆబోతు ఖడ్గంలాంటి కొమ్ములను ఒడిసి పట్టుకుని, దానితో భీకరంగా పోరాడి దాపులనున్న పల్లం లోకి దాన్ని తోశాడట.

శివుడిబసవన్న కావడంతో ఆ ఆబోతును చూసి ప్రతి ఒక్కరూ జడుసుకునే వారు. చేతులెత్తి మొక్కేవారు.

రాజుగారికి ఆతిథ్యం ఇచ్చిన పూరీ మహా రాజా తన భవన ఉపరితలం నుంచి ఈ సంచల నాత్మకమైన సంఘటనను కళ్ళారా చూశాడు. అద్భుతమైన బలపరాక్రమాలు కనబరచిన ఆ యువకుణ్ణి షాంధా (ఆబోతు కన్నా బలవం తుడు) బిరుదంతో సత్కరించాడు.

కుజాంగ్ రాజుకు సంతానం లేదు. ఆపద సమయంలో తన ప్రాణాలు కాపాడిన సాహస యువకుణ్ణి పుత్రుడిగా స్వీకరించి, సింహాస నానికి వారసుణ్ణి చేశాడు. ఆ యువకుడితోనే వృషభరాజుల వంశం ప్రారంభమయింది.



వృషభవంశానికి చెందిన చంద్రధ్వజుణ్ణి ఎవరూ అణచలేకపోయారు గనక, ఆయ నకు 'అడవి ఆబోతు' అనే బిరుదు ఉండేది. పట్టుబడని చంద్రధ్వజుడి ఆచూకీ తెలుసు కోవడానికి బ్రిటిష్ వాళ్ళు గూఢచారులను నియమించారు. చంద్రధ్వజుడికి అద్భుతమైన భుజబలంతో పాటు, అపారమైన ఆధ్యాత్మిక చింతన, ధ్యానం పట్ల ఆసక్తి ఉండేవి. సూర్యో దయానికి ముందూ, అస్తమయానంతరం ఎక్కడ ఉన్నప్పటికీ ధ్యానంలో కూర్చునేవాడు. అరణ్య మధ్యంలో అతడున్న చోటు విశ్వాస పాత్రులైన అతి సన్నిహితులకు మాత్రమే తెలుసు. ఒకనాటి వేకువజామున ఆయన ధ్యాననిమగ్నుడై వున్నప్పుడు గుట్టు చప్పుడు కాకుండా వచ్చిన బ్రిటిష్ సైనికులు ఆయన్ను పట్టుకుని బందీచేశారు. ఆయన ఉన్న రహస్య ప్రదేశం శత్రువులకు ఎలా తెలిసింది? వాళ్ళు చూపిన ధనాశవలలో పడ్డ రాజుకు సన్నిహితు డైన ఒక నమ్మకద్రోహి కుట్ర ఫలితమే అది!

సాహసవీరుడైన ఈ కుజాంగ్ రాజును గురించి "ఎ స్కెచ్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ ఒరిస్సా" అనే గ్రంథంలో బ్రిటిష్ చరిత్రకారుడు జి.

టాయిన్‌బీ ఇలా రాశాడు: "ఈ పరగణాలోని మూడు ప్రధాన పట్టణాలు తమ హస్తగతం కాగానే, మొదటి పథకం ప్రకారం కొంత సైన్యం మేజర్ ఫోర్బ్స్ నాయకత్వంలో బార్మూల్ కనుమకు పంపబడింది. కల్నల్ హార్‌కోర్ట్ నాయకత్వంలో మరికొంత సైన్యం కుజాంగ్ మీద దాడికి బయలుదేరింది. ఆ ప్రాంతంరాజు బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకంగా-తమను రక్షించుకోవడానికి దానిని దెబ్బతీయడానికి ఖుర్దా, కనికా రాజులతో లేఖలద్వారా చర్చలు జరుపుతున్నట్టు కనుగొనబడింది.

"కుజాంగ్ రాజు పారిపోయాడు... త్వర లోనే అయన్ను పట్టుకుని కటక్ కోటలో బంధించారు. అతని కోట ధ్వంసం చేయ బడింది. అక్కడొక ఫిరంగి కనిపించడంతో, దాన్ని కటక్‌కు తరలించారు. అందులో ఈస్టిండియా కంపెనీ ముద్రలు గల రెండు కొత్త ఇత్తడి తుపాకులు కనిపించాయి. అవి రాజాకు ఎలా లభించాయో తెలియలేదు. బహుశా ఏదైనా ఓడ మునిగిపోయినప్పుడో లేదా సముద్రపు దొంగల ద్వారానో అవి లభించి ఉండ వచ్చు..."



రాజును మహానది తీరంలోని చారిత్రాత్మక మైన కటక్‌లోని బరాబతి కోటలో బంధిం చారు. ఆ తొమ్మిది అంతస్థుల భవనం 14వ శతాబ్దంలో నిర్మించబడింది. దానికి బ్రహ్మాండ మైన ముఖద్వారం, చుట్టూ ఇరవై గజాల అగడ్త ఉన్నాయి. అందులో చాలా వరకు నాశ పరచిన ఈస్టిండియా కంపెనీ, దానిని ఆ ప్రాంతా నికి రాజధానిగా చేసుకున్నది.

శత్రువుల నుంచి తప్పించుకోవడం అసాధ్యం అని తెలిసినప్పటికీ బందీ అయిన చంద్ర ధ్వజరాజు చాలా ప్రశాంతంగా కనిపించాడు. యువకుడైన ఆ రాజు ఉత్సాహం, స్నేహ స్వభావం బ్రిటిష్ అధికారుల హృదయాలను దోచుకున్నాయి. మన దేశానికి చెందిన మల్ల యుద్ధం, ఇతర యుద్ధ కళలను అయన్నుంచి వాళ్ళు నేర్చుకోసాగారు. క్రమక్రమంగా అయన్ను ఒక శత్రువుగా కాకుండా తమ శిబిరంలోని ఒక గౌరవనీయుడైన మిత్రుడిగా భావించ సాగారు. అయినా, సదా సర్వవేళలా ఆయన మీద నిఘా ఉంచడం మాత్రం మానలేదు. అలాగే ఒకసంవత్సరం గడిచిపోయింది. బ్రిటిష్ ఓడల మీద దాడి కూడా తగ్గిపోయింది.

ఒకనాటి సాయంకాలం బ్రిటిష్ అధికారులు ఒక అద్భుత దృశ్యం చూశారు. నెమలి ఆకారం లోని ఒక పెద్ద పడవ మెల్లగా నదీ తీరం కేసి రాసాగింది. రంగు

రంగుల ఆ పడవ హంసలా తేలుతూ వచ్చింది. సాయం సంధ్య వెలుగులో అది అత్యంత మనోహరంగా కనిపించింది. బ్రిటిష్ అధికారులు తమ కళ్ళను తామే నమ్మలేక, కళ్ళు నులుముకుని మరీ చూశారు. ఇరవై నాలుగు మంది పడవ నడిపేవాళ్ళ మధ్య హుందాగా ఒక పెద్దమనిషి కనిపించాడు.

''ఈ పడవ నీదేనా?'' అని ఆయనన్ను అడిగారు అధికారులు.

''కాదు. ఈ అందాల పడవ ఒక రాజ కుటుంబానికి చెందినది. దురదృష్టవశాత్తు ఆ కుటుంబం ప్రస్తుతం ఆర్థిక సమస్యలలో చిక్కుకున్నది. దీన్ని అమ్మి పెట్టమని నాకు అప్పగించారు,'' అన్నాడా పెద్దమనిషి ఎంతో గంభీరంగా.

''ధర ఎంతేమిటి?'' అని అడిగారు అధికారులు ఆత్రుతగా.

పెద్దమనిషి చెప్పిన ధర విని వాళ్ళు నోళ్ళు వెళ్ళబెట్టారు.

వాళ్ళ ఆశ్చర్యాన్ని గమనించిన పెద్దమనిషి, ''మిత్రులారా! ఇలాంటి పడవలను రాజులు, రాణులు మాత్రమే ఉపయోగిస్తారు. అలాంటి వ్యక్తి మీ ఎరుకలో ఎవరైనా ఉంటే తీసుకు వచ్చి చూపించండి. ఆయన చెప్పే ధర పుచ్చుకుంటాను,'' అన్నాడు.

ఆ ప్రతిపాదన అధికారులకు సవ్యంగానే కనిపించింది. అయినా అలాంటి వ్యక్తిని ఎక్కడి నుంచి తీసుకు రావడం? ఉన్నట్టుండి వారికి బందీగా ఉన్న చంద్రధ్వజుడు గుర్తురావడంతో, క్షణాల్లో ఆయన్ను తీసుకు వచ్చి విషయం చెప్పారు.

రాజు నదీ తీరం నుంచి పడవనూ, నమస్కరించిన పెద్దమనిషినీ ఒకసారి తేరిపార చూశాడు. ఆయన పెదవులపై కదిలిన చిరునవ్వును ఆ పెద్దమనిషి మాత్రమే గమనించాడు.

రాజు ఆ పడవను పరిశీలిస్తూ పెద్దమనిషిని ఏవేవో ప్రశ్నలడుగుతూ ఆయన్ను సమీపించాడు. రాజు ఆమోదకరమైన ధరను నిర్ణయించగలడని బ్రిటిష్ అధికారులు సంబరపడ్డారు. అప్పటికే సూర్యుడు అస్తమించాడు. బేరమాడుతూ రాజు, పడవలోపలి భాగాలను పరిశీలించే వాడిలా అందులోకి అడుగు పెట్టాడు. రెప్పపాటులో ఇరవై నాలుగు మంది పడవ నడిపే వాళ్ళు తెడ్లను అందుకుని కార్యాచరణకు దిగారు. ఏం జరుగుతున్నదో అధికారులు గ్రహించేలోగా మెరుపు వేగంతో రాజుతో సహా కలల పడవ నది మలుపు తిరిగి కనుమరుగై పోయింది!

పడవలో వచ్చిన పెద్దమనిషి వేరెవరో కాదు; బందీ అయిన రాజుకు విశ్వాసపాత్రుడైన మంత్రి పట్టాజోషి! తమ రాజు చెరనుంచి తప్పించుకోవడానికి అద్భుత వ్యూహాన్ని తెలివిగా రూపొందించి విజయవంతంగా నెరవేర్చాడు.

–(ఏకెడి)



# అద్భుతమైన చిన్న పళ్ళు

కొన్ని సంవత్సరాల క్రితం, ఇద్దరు విజ్ఞాన వేత్తలు కేరళలోని అగస్త్య కొండల మీది అడవిలో తిరుగుతున్నారు. అరుదైన మొక్కలను వెతికి కనుగొనడానికి బయలుదేరిన వారికి స్థానికుడైన మల్లన్ కణి దారి చూపుతున్నాడు. కొండకు దాపుల గూడెంలో నివసించే కణి అనే గిరిజన తెగకు చెందినవాడు మల్లన్ కణి. అక్కడే పుట్టి పెరగడం వల్ల అతనికి ఆ అడవుల గురించి క్షుణ్ణంగా తెలుసు.

ఎండ తీవ్రంగా కాయడం వల్ల విజ్ఞాన వేత్తలు తొందరగా అలిసిపోయారు. అయితే, మల్లన్ మాత్రం ఏమాత్రం అలిసిపోకుండా ముందుకు నడవ సాగాడు. అప్పుడప్పుడు అక్కడక్కడ కనిపించిన చిన్న పళ్ళు కోసుకోవడానికి మాత్రం ఆగుతున్నాడు. అతడి ఉత్సాహాన్ని చూసి విజ్ఞానవేత్తలు ఆశ్చర్యపోయారు. "అతడి జీవన విధానం వల్ల అలా ఉన్నాడా? లేక అప్పుడప్పుడు నోట్లో వేసుకుని నములుతూన్న చిన్న పళ్ళ కారణంగా అంత ఉత్సాహంగా కనిపిస్తున్నాడా?" అని వాళ్ళకు అనుమానం కలిగింది.

ఆత్రుతకొద్దీ వెంటనే వాళ్ళు మల్లన్ నుంచి రెండు పళ్ళు తీసుకుని నోట్లో వేసుకుని నమిలి మింగారు. నిమిషాల్లో వారికి బలం, నూతనోత్తేజం కలగడంతో మరింత విస్తుపోయారు. వాళ్ళ మనసు ఆనందంతో ఉప్పొంగింది. మెదడులో రకరకాల ఆలోచనలు సుడులు తిరగ సాగాయి. ఈ పళ్ళను నగర ప్రజలకు అందజేస్తే ఎంత బావుంటుంది? ఈ పళ్ళ నుంచి ఔషధాలు తయారు చేసి అమ్మితే దానివల్ల మరింత మంది ప్రయోజనం పొందగలరు కదా?

విజ్ఞానవేత్తలు ఆ పళ్ళను కాచే చెట్టును చూపమని మల్లన్ కణిని అడిగారు. అయితే అతడు దానిని చూపడానికి వెనుకాడాడు.



**చందమామ ఇండియా క్విజ్-12 (జనవరి 2008) సమాధానాలు**

1. 1928; 2. జైపూర్ రెండవ జైసింగ్; 3. 14; 4. బాదామి; 5. ఏడవ స్థానంలో; 6. ఖిలా రాయ్ పిథోరా; 7. ఉత్తరప్రదేశ్.

అలాంటి మొక్కలు చాలా పవిత్రమైనవనీ, వాటిని గురించి కొత్తవారితో అసలు మాట్లాడ కూడదనీ చెప్పాడు. ఇలాంటి విషయాలను చిన్న పిల్లలుగా ఉన్నప్పుడే పెద్దలు వారికి చెబుతారు. అందువల్ల తాను ఈ విషయాన్ని తమ గూడెంలోని పెద్దలకు చెబుతాననీ, వాళ్ళే తగిన నిర్ణయం తీసుకుంటారనీ మల్లన్ కణి చెప్పాడు. ఆ తరవాత విజ్ఞానవేత్తలిద్దరినీ గూడెం పెద్దల వద్దకు వెంటబెట్టుకుని వెళ్ళాడు.

సంగతి తెలియగానే గూడెం పెద్దలందరూ ఒక చోట సమావేశమయ్యారు. విషయాన్ని చర్చించారు. ఆ మొక్కపేరు చెబితే తమ తెగకు అరిష్టమని పలువురు పెద్దలు అభిప్రాయపడ్డారు. ఆ సమాచారాన్ని తమకు చెప్పడం వల్ల కణిలకు ఎలాంటి హానీ కలగదని పెద్దలను నమ్మించడానికి విజ్ఞానవేత్తలు ఎంతగానో ప్రయత్నించారు. పైగా ఆ మొక్కలకే గనక ఔషధగుణాలు ఉన్నట్టయితే, దానిని మందుల తయారీకి ఉపయోగిస్తామనీ, ఆ విధంగా వారికి డబ్బు వచ్చే అవకాశం ఉందనీ వివరించారు.

చాలాసేపు చర్చలు, తర్జన భర్జనలు జరిగాక ఆ మొక్క పేరునూ, అవి ఉన్న చోటునూ చెప్పడానికి గూడెం పెద్దలు నిర్ణయించారు. ఆ మొక్కలుండే చోటికి విజ్ఞానవేత్తలను వెంట బెట్టుకుని వెళ్ళి చూపమని మల్లన్‌కణిని ఆదేశించారు. వాళ్ళను అడవిలోకి తీసుకువెళ్ళిన మల్లన్ కణి ఆ మొక్కలను చూపాడు. వాటిని తాము 'ఆరోగ్యపచ్చ' అని పిలుస్తామని చెప్పాడు.

ఆరోజే, విజ్ఞానవేత్తలు ఆ మొక్కలు కొన్నింటిని తమతో తీసుకువెళ్ళి ప్రయోగశాలలో వాటి రసాయనిక గుణాలను అధ్యయనం చేశారు. అలసటను పోగొట్టే కొన్ని రసాయనిక పదార్థాలు ఆ మొక్కలో ఉన్నట్టు అధ్యయనాల ద్వారా తెలియవచ్చింది. ఆ మొక్కను ఫలానా అని గుర్తించారు. దాని వృక్షశాస్త్ర నామం ట్రైకోపస్ జీలానికస్ ట్రావాన్‌కోరికస్. ఈ రకం మొక్కలు కేరళలోని ఆ ప్రాంతంలోనూ, తమిళనాడులోని కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఉన్నట్టూ, ప్రపంచంలో మరెక్కడా లేవనీ పరిశోధనల ద్వారా తెలియవచ్చింది.

ఆ తరవాత కొన్ని సంవత్సరాలపాటు జరిగిన విస్తృత పరిశోధనల ఫలితంగా, ఆ మొక్క నుంచి ఒక ఔషధం తయారుచేయబడింది. విజ్ఞాన వేత్తలు కన్న కల నిజమయింది. అలసటను పోగొట్టే మందుగా దాన్ని అమ్మడం ప్రారంభించారు.



అదిసరే, కణి గిరిజనుల పరిస్థితి, విజ్ఞాన వేత్తలు వాళ్ళకిచ్చిన మాట ఏమయిందని మీరు ఆలోచిస్తున్నారు కదూ. విజ్ఞానవేత్తలు వాళ్ళకిచ్చిన మాటను నిలబెట్టుకున్నారు. గిరిజనుల అనుమతి తోనే ఔషధం తయారుచేయబడింది. ఆ ఔషధం అమ్మగా వచ్చే ఆదాయంలో కొంత వారికి ఇచ్చారు. కణీలే తమ సంక్షేమం కోసమూ, తమకు తెలిసిన వాటిని తెలియజేయడానికీ ఒక ట్రస్ట్‌ను ఏర్పాటు చేసుకున్నారు.

ఈ ఔషధ మొక్కలు పెరిగే ప్రదేశాలు అటవీశాఖ యాజమాన్యంలో ఉంటున్నాయి. చట్టప్రకారం గిరిజనులు ఈ పళ్ళను వ్యాపారం కోసం కోసుకో కూడదు. పైగా, వాటిని అదే పనిగా కోసుకువెళితే అడవులు నశించి పోయే అపాయం ఉందని అటవీ శాఖ అధికారులు మొదట భావించడం వల్ల, ఈ చిరుపళ్ళను కోసుకోవాలంటే గిరిజనులు అటవీశాఖ అధికారుల అనుమతిని పొందవలసి వచ్చింది. ఆఖరికి అటవీ భూములలో ఈ మొక్కలను పెంచుకోవడానికి కణీలకు అనుమతి ఇచ్చారు.

మనదేశంలోని పలు ఇతర గిరిజన జాతులకు ఉన్నట్టే కణీల వద్ద కూడా ఎంతో జ్ఞానం ఉన్నది. ఆరోగ్యప్పచ్చుతో తమకు ఏర్పడిన అనుభవంతో తమ సాంప్రదాయిక జ్ఞానం ఎంతటి విలువైనదో, దానిని సక్రమంగా ఉపయోగించుకుంటే ఎలా ప్రయోజన కారి కాగలదో అనుభవపూర్వకంగా నేర్చుకున్నారు.

తమ జ్ఞానాన్ని పదిలంగా పరిరక్షించుకోవల సిన ప్రాముఖ్యతను, దానిని తమ సొంత ప్రయో జనాలకు, అభివృద్ధికి వినియోగించుకోవలసిన ఆవశ్యకతనూ వాళ్ళకు అది నేర్పింది. ఇతరులు తమను దోపిడీ చేయకుండా ఎలా కాపాడుకోవాలో కూడా అది వాళ్ళకు తెలియజేసింది.

-సీమాభట్

## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ హస్తకళలకు సంబంధించినది



1. 'పాష్మినా' అంటే ఏమిటి? దానికా పేరు ఎలా వచ్చింది?



2. ఉత్తరప్రదేశ్‌లో ఇత్తడి పాత్రలకు ప్రసిద్ధిగాంచిన నగరం ఏది?



3. మన దేశంలో శ్రేష్ఠమైన చేనేత తివాసీలు ఎక్కడ లభిస్తాయి?



4. 'పంచధాతు' విగ్రహా లను తయారు చేయ డానికి ఏఏ లోహాలను ఉపయోగిస్తారు?



5. 'మోగా సిల్క్' ఎక్కడి నుంచి వస్తుంది?

(సమాధానాలు 74వ పేజీలో)

# చందమామ క్విజ్ - 2

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు
రాసిన ఒకరికి బహుమతి
రూ. 250లు.*

ఈ నెల క్విజ్ మన పురాణాలలోని
పాత్రలకు సంబంధించినది

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - 2 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. మే 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. వైకుంఠం ద్వారపాలకుల పేర్లేమిటి?
2. తపస్వి కావడానికి ముందు బందిపోటుదొంగగా బతికిన ముని ఎవరు?
3. అంబరీషుణ్ణి శపించిన ముని ఎవరు?
4. దేవతల తల్లి ఎవరు?
5. దేవతల, రాక్షసుల గురువులు ఎవరు?
6. సప్తర్షుల పేర్లేమిటి?
7. పద్మావతీ శ్రీనివాసుల వివాహానికి అప్పు ఇచ్చిన వారెవరు?
8. చిత్రగుప్తుడు ఎవరు?
9. మహిషాసురుణ్ణి, నరకాసురుణ్ణి, తాటకిని వధించిన వారెవరు?
10. ఏకదంతుడు అనే పేరు ఎవరికి ఉన్నది?

## బీహార్ జానపద కథ

# ఎవరి మెడకు ఉరి?

ఒకానొకప్పుడు సత్యానందుడనే గురువు నడుపుతూన్న గురుకులంలో దేశం నలుమూలల నుంచి విద్యార్థులు వచ్చి విద్యనభ్యసించేవారు. వారిలో రాకుమారులు, పండితుల బిడ్డలు, వ్యాపారుల పిల్లలు అంటూ రకరకాలుగా ఉండేవారు. సత్యానందుడు అందరినీ సమానంగా చూసుకుంటూ విద్యాబుద్ధులు నేర్పేవాడు. ఎవరి పట్లా ప్రత్యేక శ్రద్ధ, పక్షపాతం అంటూ చూపేవాడు కాడు. మామూలుగా విద్యార్థులు ఐదేళ్ళపాటు అక్కడ విద్యాభ్యాసం చేసి తమ స్వస్థలాలకు తిరిగి వెళ్ళేవారు. విద్య పూర్తయ్యే సమయంలో గురువు తన శిష్యులలో ఒకణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి దేశాటన చేసి తిరిగి వచ్చిన తరవాత కొత్త విద్యార్థులతో నూతన విద్యాసంవత్సరాన్ని ప్రారంభించేవాడు.

అలా ఒకసంవత్సరం చివర గురువు ప్రతాపుడనే పదిహేనేళ్ళ శిష్యుణ్ణి తన వెంట రమ్మని పిలిచాడు. గురువుగారి వెంట వెళితే కొత్త కొత్త ప్రదేశాలను చూడవచ్చు; అక్కడి స్థితిగతులను ప్రత్యక్షంగా చూసి తెలుసుకోవచ్చన్న ఉద్దేశంతో ప్రతాపుడు అందుకు సంతోషంగా సమ్మతించాడు. మరో రెండు మూడు నెలలు గురువు వెంట ఉండి, ఎంతో జ్ఞాన సముపార్జన చేయవచ్చని ప్రతాపుడు ఆశించాడు. ఒకనాటి వేకువజామున గురుశిష్యులిద్దరూ దేశాటనకు బయలుదేరారు. గురువు వెనక శిష్యుడు నడవాలి. నడిచి వెళ్ళేప్పుడు మాట్లాడకూడదు. ఏ చెట్టు కిందో, సత్రంలోనో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు మాత్రమే శిష్యుడు తను చూసిన వాటిని వివరించి, అనుమానాలు ఉంటే గురువును అడగవచ్చు. గురువు తగిన వివరణతో అనుమాన నివృత్తి చేస్తాడు. ఇదీ ప్రయాణంలో అనుసరించవలసిన నియమం.

ఆలయాలను సందర్శించినప్పుడు స్థానికులు ఇచ్చే ఆతిథ్యాన్ని స్వీకరించి, ఒకటి రెండు



రోజులు గడిపి ప్రయాణాన్ని కొనసాగించే వారు. రాజధానీ నగరాలగుండా వెళ్ళేప్పుడు రాజులను సందర్శించి, గురువు వారితో రాజ్యం లోని పరిస్థితుల గురించి చర్చించే వాడు. సామాన్య ప్రజల మనోభావాలను కూడా తెలుసు కుంటూ ముందుకు వెళ్ళేవారు.

ఆ విధంగా వెళుతూన్న గురుశిష్యులు బోధ్‌పురి అనే రాజ్యంలో ప్రవేశించారు. రాజ ధానీ నగరం చేరి రాజభవనాన్ని చేరేలోగా వారికి ఆ రాజ్యాన్ని ఏలుతూన్న రాజు పరమ మూర్ఖుడనీ, విచిత్రమైన ప్రవర్తన కలవాడనీ తెలియవచ్చింది. ఆయన తనలాంటి మూర్ఖు లకే మంత్రి పదవులిచ్చి ఘనంగా సత్కరించే వాడు. గొప్పగా జీతబత్తాలిచ్చేవాడు. రాజా స్థానంలోని మేధావంతులకు చాలీచాలని జీతా లిచ్చి వారినీ, వారి కుటుంబాలనూ వేధించే వాడు. అందువల్ల వారు అవినీతికి పాల్పడే వారు. అయినా వారిని రాజు కనిపెట్టలేకపోయే వాడు. దీనికి తోడు తనకు తోచిన వింత వింత ఆలోచనలను వెంటనే అమలు పరచేవాడు. ధాన్యాలకు, కాయగూరలకు, బట్టలకు, చెప్పులకు అన్నిటికీ ఒకే ధర నిర్ణయించేవాడు. ఇదేమిటని అడిగిన వారినీ, అనారోగ్యం కారణంగా పనిపాటులకు వెళ్ళలేని వారినీ కఠినంగా శిక్షించేవాడు.

ఇలాంటి విడ్డూరాలను వింటూ గురువు వెంట నడుస్తూన్న ప్రతాపుడికి అనుమానం తలెత్తి, ''అలాంటి మూర్ఖశిఖామణి అయిన రాజును చూస్తే మనకూ ఏదైనా ప్రమాదం ఏర్పడవచ్చు. ఆయన్ను చూడకుండా మనం



దారి మళ్ళించడం క్షేమం అనుకుంటాను, గురువర్యా!'' అన్నాడు.

''మనం విన్నవన్నీ నిజమే అని మనకు ఎలా తెలుసు? స్వయంగా వెళ్ళి చూసి నిజా నిజాలు తెలుసుకుందాం,'' అన్నాడు గురువు.

ఇద్దరూ రాజభవన ద్వారం వద్దకు చేరి రాజును దర్శించాలని చెప్పారు. సభలో న్యాయ విచారణ జరుగుతున్నదని చెప్పి, కాపలా భటులు వారిని లోపలికి అనుమతించారు. ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

నిండుసభలో ఇద్దరు స్త్రీలు రాజు ఎదుట నిలబడి ఉన్నారు. ఆ ఇద్దరిలో ఒక స్త్రీ, ''ప్రభూ, మా భర్తలు ఇద్దరూ తోడుదొంగలు. ఒక ధనిక వర్తకుడి ఇంటికి దొంగతనానికి వెళ్ళారు. అతడు ఇంటి వద్ద లేనప్పుడు అతడి ఇంటికి కన్నం వేస్తూండగా గోడ విరిగి పడింది,'' అంటూ భోరున ఏడ్వసాగింది.



''ఆ గోడ విరిగి పడ్డం వల్ల వాళ్ళిద్దరూ చనిపోయారు. ఆ ఇంటిని సరిగ్గా నిర్మించివుంటే, మా భర్తలు చనిపోయేవారు కారు. ఇంటి గోడను దృఢంగా నిర్మించని ఆ వర్తకుణ్ణి శిక్షించాలి. మా భర్తల ప్రాణాలు తీసినందుకు మాకు తగిన నష్టపరిహారం చెల్లించాలి,'' అంటూ ఫిర్యాదును పూర్తి చేసింది రెండవ స్త్రీ.

ఆ తరవాత ఇద్దరు స్త్రీలూ కొంగుతో కన్నీళ్ళు తుడుచుకోసాగారు.

''ఆ వర్తకుణ్ణి తీసుకురండి!'' అని ఆజ్ఞాపించాడు రాజు. భటులు వర్తకుణ్ణి రాజు ఎదుట హాజరుపరిచారు. ''ప్రభూ! గోడ కూలడంలో నా అపరాధమేమీలేదు. పోయిన సంవత్సరం దానిని కట్టిన తాపీ పనివాడు దృఢంగా కట్టలేదు. అందుకే అది అలా కూలి పోయింది. అందువల్ల అది తాపీ పనివాడి తప్పు,'' అన్నాడు వర్తకుడు.

''తాపీ పనివాణ్ణి ఈడ్చుకు రండి,'' అని రాజు భటులను ఆజ్ఞాపించాడు.

వాడు వచ్చి రాజుపాదాలపై బడి, ''ప్రభూ ఇందులో నా తప్పేమీ లేదు. నీళ్ళు మోసుకొచ్చే వాడు ఆ రోజు నేను చూస్తూండగానే ఎక్కువ నీళ్ళు పోసి కలిపాడు. అధిక తేమ వల్లనే గోడ బలహీనపడిపోయింది. గోడ కూలి పడడానికి తప్పు వాడిదే,'' అన్నాడు.

''దుర్మార్గుడైన ఆ నీళ్ళు మోసేవాణ్ణిపట్టుకు రండి,'' అని ఆగ్రహంతో అరిచిన రాజుకు తీరా వాడు వచ్చాక వాణ్ణి విచారించడానికి కూడా ఓపిక లేక, ''వీణ్ణి లాక్కు పోయి ఉరితీయండి!'' అని ఆజ్ఞాపించాడు.

''ఏమిటీ దురన్యాయం!'' అని సభలోని వారందరూ దిగ్భ్రాంతితో వాపోయారుగాని వాళ్ళ అదృష్టం కొద్దీ అది రాజుకు వినిపించలేదు.

అవన్నీ చూస్తూంటే ప్రతాపుడికి వెగటు పుట్టి అక్కడ నిలబడలేక, ''మనం వెళ్ళిపోదాం గురువర్యా! తరవాతి క్షణంలో రాజు ఏం చేస్తాడో తెలియదు,'' అన్నాడు.

''కాదు, నాయనా. నేను వెళ్ళి రాజుతో మాట్లాడతాను,'' అంటూ గురువు రాజుకేసి ఒక అడుగు ముందుకు వేసి, ''రాజా! ఒక్క క్షణం ఆలోచించి చూడు! నీళ్ళు మోసేవాడికి తమరు విధించిన శిక్ష అన్యాయం కాదా?'' అన్నాడు.

''న్యాయాన్యాయాల గురించి నాకు చెప్పడానికి నువ్వెవరు? నీ పొగరుబోతుతనాన్ని నేను ఉపేక్షించ లేను,'' అన్న రాజు భటుల కేసి తిరిగి, '' ఆ నీళ్ళు మోసే వాడికి బదులు,

ఈ పొగరుబోతును తీసుకెళ్ళి ఉరి తీయండి!'' అని ఆజ్ఞాపించాడు.

ఇద్దరు భటులు వచ్చి గురువును చెరొక వైపు పట్టుకుని లాక్కుపోసాగారు. శిష్యుడు ఆయన వెంట నడుస్తూ అదే పనిగా ఆయన చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు.

దానిని గమనించిన రాజు, ''ఈ సమయంలో నీ శిష్యుడు నీకు చెప్పిన రహస్యం ఏమిటో చెప్పు,'' అని అడిగాడు.

''అతనికి దివ్యదర్శనం కలిగిందట ప్రభూ!'' అన్నాడు గురువు.

''ఏమిటా దివ్య దర్శనం!'' అని అడిగాడు రాజు.

''ఈ శుభఘడియలో మరణదండన పొందే వ్యక్తిని తీసుకువెళ్ళడానికి స్వర్గాధిపతి దివ్య రథంలో వస్తున్నాడట! వెంటనే నన్ను ఉరి తీయండి. సంతోషంగా స్వర్గానికి వెళతాను,'' అన్నాడు గురువు.

ఆ మాటతో ఆగ్రహం చెందిన రాజు, ''నీ కోసం స్వర్గాధిపతి ఎందుకు రావాలి? నేను ఈ రాజ్యానికి రాజును. నువ్వు కేవలం ఒక గురువు! అందువల్ల నీ తరఫున, నీ స్థానంలో నేనే మరణదండన పొంది తిన్నగా వెళ్ళి స్వర్గంలో స్థానం సంపాదిస్తాను,'' అంటూ రాజు ఒక్క గెంతున ఎగిరి ఉరితీసేవాడి ముందుకు వెళ్ళి నిలబడ్డాడు.

అయితే, ఆ ఉరితీసేవాడు రాజు అంతటి మూర్ఖుడు కాడు. ''ప్రభూ! ఈ ఉరిత్రాడు చాలా చిన్నది. తమ మెడకు చాలదు,'' అన్నాడువణుకుతూన్న చేతులతో.

రాజు ఆశాభంగంతో వెనకడుగు వేసి తన సింహాసనం కేసి వెనుదిరిగాడు.

అంతలో గురువు శిష్యుడితో, ''ఈ కరుడు కట్టిన మూర్ఖుణ్ణి మార్చడానికి ప్రయత్నిస్తే మనమే చిక్కుల పాలవుతాం. ఇలాంటి వారికి దూరంగా ఉండడమే ఉత్తమం. కొందరు ఈ భూమిపై మూర్ఖులుగా పుడతారు. మరి కొందరు పరిస్థితులవల్ల మూర్ఖులవుతారు. దుర్మార్గుల కారణంగా ఇంకా కొందరు మూర్ఖులవుతారు. మనకు ఇలాంటి వారితో పని లేదు. ప్రపంచంలో కొందరయినా వివేకవంతులు ఉన్నారా అని చూడడమే మనపని, రా వెళదాం,'' అంటూ అక్కడి నుంచి వేగంగా వెలుపలికి వచ్చాడు.

ఆ తరవాత ఏమై ఉంటుందో మిగిలిన కథ మీరే ఊహించుకోండి.



# దేవుడికి అవకాశం!

రామాపురం కామయ్య తన తోటలో పండించిన కూరగాయలను బస్తాలకు నింపి బండిలో వేసుకుని అమ్మడానికి పట్నం సంతకు బయలుదేరాడు. అడవి కనుమ ప్రాంతంలో బాట మలుపు తిరుగుతూండగా బండి చక్రం ఒకటి పక్కకు వాలిపోయింది. ''దేవుడా! కాపాడు,'' అంటూ బండి నుంచి కిందికి దూకిన కామయ్య తలపై చేతులు పెట్టుకుని కూర్చున్నాడు. దేవుళ్ళందరినీ పేరు పేరునా ప్రార్థించాడు. అయినా ఒక్క దేవుడూ పలకలేదు.

ఆఖరికి లేచి నడుం బిగించి ఎడ్లను అదిలిస్తూ తనే స్వయంగా వాలిపోయిన బండి చక్రాన్ని పైకెత్తడానికి పూనుకున్నాడు. కామయ్య తాను అనుకున్న దాని కన్నా బండి చక్రం సులభంగా బాటమీదికి చేరడంతో ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి చూశాడు. వెనక ఒక దృఢకాయుడు తనతో భుజం కలిపి చక్రాన్ని పైకెత్తడం వల్లే అది సాధ్యమయిందని గ్రహించి కామయ్య అతడికి దణ్ణం పెట్టి, ''దేవుడు చేయనిసాయం సమయానికి నువ్వు వచ్చి చేశావు. చల్లగా ఉండాలి బాబూ,'' అన్నాడు.

''దేవుడా కాపాడు అంటూ డీలాపడి కూర్చుంటే దేవుడు మాత్రం ఏంచేస్తాడు? నువ్వు ప్రయత్నిస్తేనే దేవుడిక్కూడా సాయపడే అవకాశం కలుగుతుంది,'' అని నవ్వుతూ చెట్టుకు ఆనించిన కట్టెల మోపును తలపైకెత్తుకుని తన దారిన వెళ్ళిపోయాడా మనిషి. –మంజుభారతి



## బీర్బల్ కథలు : 7

# తారుమారైన పరీక్ష

అక్బర్ ఆస్థానంలోని పలువురు ఉద్యోగులకు బీర్బల్ అంటే తగని అసూయ. అలా అసూయ పడే వాళ్ళందరూ ఒకనాడు రహస్యంగా సమావే శమై బీర్బల్‌ను చక్రవర్తి అభిమానానికి దూరం చేయడం ఎలాగా అని తీవ్రంగా చర్చించారు. పలు సూచనలను పరిశీలించారు. ఆఖరికి దావూద్ అనే ఒక ఉన్నతోద్యోగి తనవద్ద చక్కని పథకం ఉన్నదని చెప్పాడు. తక్కినవారు ఆ పథకం వివ రాలు అడిగారు. బీర్బల్ నిజాయితీ పట్ల చక్రవర్తి మనసులో అనుమానం కలిగించగలనని చెప్పాడు దావూద్.

''చక్రవర్తి నీ మాటలు నమ్మగలడా?'' అని అడిగాడు ఒకడు.

''నమ్మగలడు. వేచి చూడండి,'' అన్నాడు దావూద్.

''అదే. ఎలా నమ్మించదలిచావో మాతో చెప్ప వచ్చు కదా?'' అన్నాడు.

''చెప్పను. దాన్ని రహస్యంగా ఉంచాలి. అయితే, నా పథకం తప్పదు. అది మాత్రం నిజం,'' అంటూ విశ్వాసంతో నవ్వాడు దావూద్.

ఆ మాట విన్నవారికి ఆనందం పొంగి పొరి లింది, ''నువ్వు తెలివితేటల్లో బీర్బల్‌కు ఏమాత్రం తీసిపోవు. బీర్బల్‌కు దీటైన వాడివి నువ్వే. నీ పథకాన్నే గనక విజయవంతంగా నెరవేర్చావంటే నీకు ఆపై తిరుగుండదు. మా గౌరవానికీ, చక్ర వర్తి అభిమానానికీ, పాత్రుడివి కాగలవు,'' అన్నాడు ఒకడు.

తక్కినవారు అతడి మాటలకు, ''అవును, అవును,'' అంటూ వంతపాడారు.

''నా పట్ల మీరు కనబరుస్తూన్న నమ్మకానికి కృతజ్ఞతలు!'' అన్నాడు దావూద్.

''బీర్బల్‌ను అందరి ముందూ మోకరిల్లేలా చేయగలిగితే, నిన్ను మేము సంతోషంగా మా నాయకుడిగా స్వీకరిస్తాం,'' అన్నాడు ఒక ఉద్యోగి.

తల పంకిస్తూ కొంతసేపు తీవ్రంగా ఆలోచించిన దావూద్, ''అయితే, మీరొక పనిచేయాలి,'' అన్నాడు.

''ఏమిటి?'' అని అడిగారు ఉద్యోగులు.

'రేపు మీరు యథా ప్రకారం మామూలు సమయానికి సభకు వెళ్ళి కూర్చోండి. చక్రవర్తి



వచ్చి నేను లేకపోవడం గమనించి, నన్ను గురించి మిమ్మల్ని అడుగుతాడు. అప్పుడు 'దావూద్ ఏదో అక్రమమైన నేరం జరగడం చూసి మానసికంగా కుంగిపోయాడట. అందులో నుంచి కోలుకుని కొంతసేపు ఆలస్యంగా రావడానికి ప్రభువుల అనుమతి కోరాడు,' అని మీలో ఒకరు చెప్పండి. ఆ తరవాత నేను వచ్చి, నేను చూసిన ఘోరమైన నేరం ఏమిటో చక్రవర్తికి విన్నవిస్తాను. ఆ తరవాత ఏం జరుగుతుందో మీరే చూద్దురుగాని,'' అన్నాడు దావూద్.

''అలాగే! అలాగే!'' అంటూ తలలూపారు తక్కినవారు. కాస్సేపు అదీ ఇదీ మాట్లాడుకుంటూ గడిపి, బాగా పొద్దు పోవడంతో ఇళ్ళకు వెళ్ళిపోయారు.

మరునాడు బీర్బల్‌తో సహా అందరూ సభకు హాజరయ్యారు. చక్రవర్తికి బీర్బల్ మీద ఉన్న నమ్మకాన్ని పోగొట్టాలన్న ప్రయత్నంలో ఉన్న దావూద్ ఒక్కడు మాత్రమే అక్కడ లేడు.

భటులు దండంతో నేలను తాటిస్తూ, ''చక్రవర్తి విచ్చేస్తున్నారు!'' అని మూడు సార్లు ప్రకటించారు. చక్రవర్తి రాకతో గౌరవ సూచకంగా సభికులు లేచి నిలబడ్డారు. చక్రవర్తి మందహాసం చేస్తూ సింహాసనంపై ఆసీనుడయ్యాడు. ఇద్దరు యువతులు సింహాసనానికి ఇరువైపులా నిలబడి వింజామరలు వీచసాగారు.



చక్రవర్తి చేయి ఊపగానే సభికులు తమ తమ ఆసనాలలో కూర్చున్నారు. చక్రవర్తి సభకేసి పరిశీలనగా చూశాడు. సభలో కూర్చున్న ఒక మధ్యవయస్కుడు లేచి నిలబడ్డాడు. దానిని గమనించిన చక్రవర్తి, ''నువ్వేమైనా చెప్పదలుచుకున్నావా?'' అని అడిగాడు.

ఆ సభికుడు వంగి సలాం చేసి, ''ఆలస్యంగా వస్తున్నానని దావూద్ చెప్పి పంపాడు, ప్రభూ!'' అన్నాడు.

''ఆలస్యానికి కారణం?'' అని అడిగాడు చక్రవర్తి కంఠస్వరాన్ని పెంచి.

''ఆయన ఏదో ఘోరమైన నేరం జరగడం కళ్ళారా చూశాడట. చక్రవర్తి ఆస్థానంలోని ఒక ప్రముఖుడే ఆ నేరం చేశాడట. దానిని ప్రత్యక్షంగా చూసిన దావూద్ దిగ్భ్రాంతి చెందాడట. ఆ దిగ్భ్రాంతి నుంచి కోలుకోగానే సభకు రాగలనని వర్తమానం పంపాడు ప్రభూ!'' అన్నాడు ఆ వ్యక్తి.

ఆస్థానంలోని ప్రముఖుడే ఏదో నేరాన్ని చేశాడని వినడంతో చక్రవర్తి మనసు కలతకులోనయింది. ఆయన మరేమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు. సభలో నిశ్శబ్దం అలముకున్నది. కొంత సేపటికి దావూద్ వచ్చే అడుగుల చప్పుడు వినిపించింది. చక్రవర్తి అతడికేసి చూశాడు. దావూద్ వంగి, గౌరవంతో చేయి పైకెత్తి, ''సలాం అలేకుం. సహేన్‌షా,'' అన్నాడు.

''నువ్వేదో నేరం జరగడం చూశావట?'' అని అడిగాడు చక్రవర్తి.

''అవును ప్రభూ!'' అన్నాడు దావూద్.

''నా ఆస్థానంలోని ప్రముఖుడే ఆ నేరం చేశాడని చెప్పావని విన్నాను, నిజమేనా?'' అన్నాడు చక్రవర్తి.

''అవును ప్రభూ! అదే నాకూ దిగ్భ్రాంతి కలిగించింది,'' అన్నాడు వినయుడు.

''ఎవరా నేరస్థుడు. చెప్పు,'' అంటూ చక్రవర్తి సింహాసనం పైనుంచి లేచాడు ఆగ్రహంతో.

''ఆ సంగతి మరిచి పోదాం ప్రభూ! నా సహోద్యోగిని గురించి చెడుగా మాట్లాడడం నాకిష్టం లేదు ప్రభూ,'' అన్నాడు దావూద్ బాధ నటిస్తూ.

''చట్టానికి ఎవరూ అతీతులుకారు. ఎవడా నిందితుడు చెప్పు,'' అని గద్దించి అడిగాడు చక్రవర్తి.

''మరెవరో కాదు ప్రభూ. బీర్బల్!'' అన్నాడు దావూద్.

సభలోని అందరికళ్ళూ బీర్బల్ వైపు తిరిగాయి. నిందారోపణ చేసిన దావూద్ దానిని ఎలా నిరూపిస్తాడో అని అందరూ ఆత్రుతగా ఎదురు చూడసాగారు.

''బీర్బలా?'' అని ఆశ్చర్యపోయాడు చక్రవర్తి నమ్మలేనట్టు.

''అవును ప్రభూ! నిన్న సాయంకాలం నేను ఇంటికి తిరిగి వెళుతూ, దారి పక్కన పడివున్న ఒక బంగారు హారాన్ని బీర్బల్ తీసుకోవడం చూశాను. కింద పడిపోయిన తన హారాన్ని తను తీసుకుంటున్నాడని అనుకున్నాను. అయితే, ఆయన దాన్ని మెడలో వేసుకోవడానికి బదులు తన దుస్తుల్లో దాచుకుని వేగంగా వెళ్ళిపోవడం గమనించాను. కొంత సేపటికి ఒక యువకుడు, 'నా హారం ఎవరైనా చూశారా?' అని అడుగుతూ ఏడుస్తూ అటుకేసి వచ్చాడు. 'హారం పోగొట్టుకున్నావా?' అని అడిగాను. 'అవును, బంగారు



హారం! ఈ దారిలోనే ఎక్కడో పడిపోయింది,' అన్నడా యువకుడు కన్నీళ్ళతో. ఆ యువకుణ్ణి గురించి మరిన్ని వివరాలు అడుగుదామనుకునేలోగా అతడు వెళ్ళిపోయాడు,'' అన్నాడు దావూద్.

''బీర్బల్!'' అని పిలిచాడు చక్రవర్తి కఠిన స్వరంతో.

''ప్రభూ!'' అంటూ లేచి నిలబడ్డాడు బీర్బల్.

''ఇది నిజమా?'' అని అడిగాడు చక్రవర్తి.

''కాదు, ప్రభూ!'' అన్నాడు బీర్బల్.

''ప్రభూ! ఒకవేళ నేనే పొరబడ్డానేమో!'' అన్నాడు దావూద్ జాలినటిస్తూ.

''మరి, బీర్బల్ నిరపరాధి అని ఎలా నిరుపించగలవు?'' అని అడిగాడు చక్రవర్తి.

''ప్రభూ! ప్రభువులు మన్నిస్తారంటే బీర్బల్ నిరపరాధి అని నిరూపించడానికి ఒకపరీక్ష ఉన్నది ప్రభూ!'' అన్నాడు దావూద్.

''ఏమిటా పరీక్ష?'' అని అడిగాడు చక్రవర్తి.

'నేను ఎర్రగా కాలిన ఇనుప కడ్డీని తీసుకుని సభకు వస్తాను. దాన్ని బీర్బల్ వట్టిచేతులతో పట్టుకోవాలి. ఆయన చేతులు కాలలేదంటే ఆయన నిరపరాధి,'' అన్నాడు దావూద్.

''బీర్బల్ ఇంత నీచకృత్యానికి పాల్పడి ఉంటాడని నేను భావించడంలేదు. అయినా, పరీక్షలో నెగ్గితే నిరపరాధి అని తేలిపోతుంది కదా!'' అన్నాడు సభలోని ఒక వృద్ధుడు. అందుకు మిగిలిన సభికులు ఆమోదం తెలిపారు.

''నిజమే!'' అంటూ బీర్బల్ కేసి తిరిగి, ''నిందారోపణ జరిగింది గనక, నిరపరాధి అని రుజువు కావడం అవసరం. చట్టం ముందు అందరూ సమానం కదా!'' అన్నాడు అక్బర్.

''చిత్తం, ప్రభూ!'' అన్న బీర్బల్ తను పెద్ద చిక్కులో పడ్డట్టు గ్రహించాడు. ఎర్రగా కాగిన ఇనుప కడ్డీని ఎవరు పట్టుకున్నా తప్పక కాలి తీరుతుంది. వెంటనే, ''గౌరవనీయుడైన నా సహోద్యోగి పెట్టే పరీక్షకు నేను సిద్ధం. అయితే...'' అని ఆగాడు బీర్బల్.

''ఏమిటి చెప్పు,'' అన్నాడు అక్బర్.

''దావూద్ నిజం చెప్పానంటున్నాడు. నేను అతన్ని నమ్ముతున్నాను. అయితే, అతడు నిజమే చెబుతున్నాడని అతడే రుజువు చేయవచ్చని నేను అనుకుంటు న్నాను. ఆయన చేయవలసిందల్లా కాలిన ఎర్రటి ఇనుప కడ్డీని వట్టి చేతులతో పట్టుకుని తెచ్చి నాకు ఇవ్వడం మాత్రమే. ఆయన నుంచి నేను ఆయన చెప్పినట్టే పుచ్చుకుంటాను...'' అని ఆగాడు.

దావూద్ రాయిదెబ్బతిన్న కుక్కలా కుయ్‌మంటూ, ''వీలు కాదు... కాదు!'' అని అరిచాడు.

తను రూపొందించిన కుతంత్రాన్ని బీర్బల్ తనమీదికే తిప్పి కొట్టాడని దావూద్ గ్రహించి భయకంపితుడయ్యాడు. ''ప్రభూ, నన్ను క్షమించండి. నేను చూసింది బీర్బల్‌ని కాదు. ఆ వ్యక్తి ఇతనికన్నా కాస్త ఎత్తుగా ఉన్నాడు. నేను పొరబడ్డాను. బీర్బల్ అంత నీచ కృత్యానికి పాల్పడడు కదా,'' అంటూ చక్రవర్తి ముందు మోకరిల్లాడు.

''ఈ నీచుణ్ణి తీసుకెళ్ళి చీకటికొట్లో బంధించండి. ఎలాంటి శిక్ష విధించాలో తరవాత ఆలోచిద్దాం,'' అని ఆజ్ఞాపించిన అక్బర్, బీర్బల్ కేసి తిరిగి, ''క్షణం బుద్ధి మందగించి నిన్ను పరీక్షకు గురిచేయాలనుకున్నాను, నన్ను క్షమించు బీర్బల్,'' అన్నాడు.

''సదా సర్వ వేళలా నిజాయితీగా, తమకు విశ్వాసపాత్రుడిగా ఉండడం నా భాగ్యంగా భావిస్తాను ప్రభూ!'' అన్నాడు బీర్బల్ వంగి నమస్కరిస్తూ.





# తరతరాల ఒలింపిక్స్

## ఒలింపిక్ మోటో

మరింత వేగం, ఉన్నతం, బలం అన్న అర్థాలుగల మూడు లాటిన్ పదాలు ఆధునిక ఒలింపిక్స్ (1896 నుంచి) మోటోగా ఉంటున్నాయి. మోడర్న్ గేమ్స్ వ్యవస్థాపకుడైన బేరన్ పీరీ కూబెర్టిన్ స్నేహితుడు హెన్రీ డైడన్ ఈ మోటోను ఎంపిక చేశాడు.

## ఒలింపిక్ చిహ్నం

ఒక దానితో ఒకటి కలిసి వున్న ఐదు వలయాలను 1913లో ఒలింపిక్ చిహ్నంగా స్వీకరించారు. అవి తెల్లటి నేపథ్యంలో ఒలింపిక్ ఫ్లాగ్‌లో ఉంటాయి. ఐదు వలయాలు ఆఫ్రికా, అమెరికా, ఆసియా, ఆస్ట్రేలియా, యూరపు ఖండాలను సూచిస్తాయి.

## మొదట-చివర

క్రీడలలో పాల్గొనే దేశాల జట్లు ప్రారంభోత్సవ మార్చ్‌పాస్ట్‌లో పాల్గొంటాయి. ఇవన్నీ అక్షర క్రమంలో ఒకటి తరవాత ఒకటి వెళతాయి. అయితే ఇందులో రెండు మినహాయింపులు ఉంటాయి. ప్రాచీన ఒలింపిక్ క్రీడలను నిర్వహించిన గ్రీసు దేశ క్రీడాకారులు మార్చ్‌పాస్ట్ మొదట వెళతారు. ఇప్పటి క్రీడలకు ఆతిథ్యమిస్తున్న దేశ క్రీడాకారులు చివరగా క్రీడాప్రాంగణాన్ని చేరుకుంటారు.

## మొట్టమొదటి ఛాంపియన్



**192** మీ. పరుగుపందెంలో పాల్గొన్న కొరిబస్ తొలి ఒలింపిక్ ఛాంపియన్ (ప్రాచీన ఒలింపిక్స్). దానిని 'స్టేడ్' అనే వారు. జరిగిన ఒకే పోటీలో అతడు విజేత అయ్యాడు. కొరిబస్ వంటవాడుగా పనిచేసేవాడు. క్రీడల సమయంలో గ్రీసు స్టేట్స్ మధ్య యుద్ధాలు ఆపేసేవారు. ఆయుధాలు పట్టుకుని రావడానికి ఎవరినీ అనుమతించేవారు కాదు.

## పురుషులు మాత్రమే



గ్రీసులో నిర్వహించబడ్డ ప్రాచీన క్రీడలలో పోటీదారులందరూ అన్ని పోటీలలోనూ నగ్నంగా పాల్గొనవలసి ఉండేది. అందువల్ల స్త్రీలు ఎవరూ పాల్గొనేవారు కారు. క్రీడలలో పోటీ పడడానికి 1900 (ప్యారిస్)లోనే మొట్టమొదటి సారిగా స్త్రీలను అనుమతించారు. అది కూడా పరిమిత సంఖ్యలోని పోటీలలో మాత్రమే అనుమతించబడ్డారు.




# పితృద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో బోధిసత్త్వుడు ఒక రైతు ఇంట జన్మించాడు. అతడిని తల్లిదండ్రులు చాలా గారాబంగా చూసుకునేవారు. వాళ్ళు అతనికి కమలుడు అని పేరు పెట్టారు.

కమలుడు చిన్నతనం నుంచి కూడా వయసుకు మించిన తెలివితేటలు కనబరుస్తూ వచ్చాడు. తలిదండ్రులు తనను ఎంత గారాబంగా చూసినా, అతనికి తన తాత మీద ఎక్కువ మక్కువగా ఉండేది.

ఈ తాత చాలా ముసలివాడు. ఏ పనీ చేయలేడు. పైగా, ఆయనకే మిగిలినవాళ్ళు ఉపచారాలు చేయవలసి ఉండేది. ఇది కమలుడి తల్లికి ఎంతో బాధగా ఉండేది. ఆయనకు సేవలు చేయలేక ముసలివాడు ఎప్పుడు పోతాడా అని ఎంతోకాలం ఎదురు చూసింది. కాని ఆయన మాత్రం చావలేదు.

ఒక రోజామె తన భర్తతో, ''మీ నాయనతో నాకు ప్రాణం విసిగిపోతున్నది. మిగిలిన చాకిరీ ఒక ఎత్తూ, ఆయన సేవ ఒక ఎత్తూగా వుంది,'' అన్నది.

''పెద్దవాడైపోయాడు. ఇంకెంత కాలం బతుకుతాడులే!'' అన్నాడు రైతు.

''ఎంతమందికి చావు వచ్చినా ఆయనకు మటుకు రాదు. ఈ జన్మకికనేను సుఖపడేది లేదు,'' అన్నది రైతు భార్య.

''ఆయువున్నన్నాళ్ళు బతకనీ. ఏం చేస్తాం? చేతులారా చంపుకుంటామా?'' అన్నాడు రైతు.

''ఏం చంపితే? బతికి ఆయనకు సుఖమా, మనకు సుఖమా? ముసలి ప్రాణానికెంత కావాలి?'' అన్నది భార్య విసుగ్గా.

రైతుకు తండ్రిని చేతులారా చంపటమంటే మొదట్లో చాలా ఘోరంగా కనబడింది.

జాతక కథ

కాని పెళ్ళాం చాలా రోజులు పోరిన మీదట, ఆమె మాటలు వినీవినీ అందులో ఏమంత తప్పు లేదనిపించింది.

చివరకు రైతు తన తండ్రిని ఎవరికీ తెలియకుండా చంపి మాయం చెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన తన తండ్రి దగ్గిరికి వెళ్ళి, ''నాన్నా, పొరుగూళ్ళో అప్పు మాట్లాడాను. వాళ్ళు నువ్వు రాకపోతే ఇవ్వమన్నారు. ఓపిక చేసుకుని బండి మీద బయలుదేరు,'' అన్నాడు.

ముసలివాడు నిజమేననుకుని బయలుదేరాడు. తాతను విడిచి ఒక్క క్షణం ఉండని కమలుడు కూడా ఎవరు ఎన్ని చెప్పినా వినక తాతతోపాటే బండి ఎక్కి కూచున్నాడు.

తప్పేది లేక రైతు తన తండ్రినీ, కొడుకునూ వెంటపెట్టుకుని బండి తోలుతూ బయలుదేరాడు. వాళ్ళు వెళ్ళే దారిలో ఒక చిన్న అడవి ఉంది. రైతు అడవి మధ్య బండి ఆపి, ''ఇప్పుడే వస్తా!'' అంటూ బండిలో ఉన్న పార ఒకటి తీసుకుని చెట్ల మధ్యకు వెళ్ళాడు.

కమలుడు తాతతో, ''ఇప్పుడే వస్తా!'' అని చెప్పి మరొక పార తీసుకుని తండ్రి వెనకే చప్పుడు కాకుండా వెళ్ళాడు. కొంత దూరం వెళ్ళాక తండ్రి ఒక పొద పక్క గొయ్యి తవ్వుతూ కమలుడికి కనిపించాడు. కమలుడు అదే పొద అవతలివైపు చేరి అక్కడ తాను కూడా ఒక గొయ్యి తవ్వనారంభించాడు.

ఆ చప్పుడు విని రైతు తన పని ఆపి, పొద అవతలికి వెళ్ళి, కొడుకును చూసి ఆశ్చర్యపోతూ, ''ఎందుకక్కడ గొయ్యి తవ్వుతున్నావు?'' అని అడిగాడు.



కమలుడు తండ్రిని చూసి, ''నువ్వెందుకు తవ్వుతున్నావో అందుకే,'' అన్నాడు.

''నేనెందుకు తవ్వుతున్నానో నీకు తెలుసునా?'' అని అడిగాడు రైతు.

''నాకు తెలీదు. ఎందుకు తవ్వుతున్నావు?'' అన్నాడు కమలుడు.

''నా తండ్రిని పూడ్చటానికి గొయ్యి తవ్వుతున్నాను! ఆయన చస్తే పాతి పెట్టాలిసిన బాధ్యత నాకున్నది. ఎందుకంటే, నేనాయన కొడుకును,'' అన్నాడు రైతు.

''ఆయన ఇంకా బతికే ఉన్నాడుగా?'' అన్నాడు కమలుడు.

''ప్రాణం శాశ్వతమా?'' అన్నాడు రైతు.

''నా తండ్రి చస్తే పాతెయ్యవలసిన బాధ్యత నాకూ ఉన్నది. నీ ప్రాణం మాత్రం శాశ్వతమా?'' అన్నాడు కమలుడు.

రైతుకు తల కొట్టేసినట్టయింది. తన కొడుకు ఈ మాట అన్నదాకా, తాను ఎంత నీచమైన పని చేస్తున్నదీ రైతుకు తెలిసి రాలేదు. ఆయన సిగ్గుపడి, పార తీసుకుని, ''పోదాం పద!'' అన్నాడు. కమలుడు కూడా తవ్వటం మానేసి తండ్రి వెంట వచ్చేశాడు.

రైతు బండిని వెనక్కు మళ్ళించి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఈ లోపల కమలుడి తల్లి, మామ చచ్చిపోయినట్టే భావించి, ఆనందం కొద్దీ పిండి వంటలు చేసి భర్తకోసం, కొడుకు కోసం ఎదురు చూస్తున్నది.

తిరిగి వచ్చిన బండిలో మామ ఉండటం చూసి ఆవిడకు చాలా ఆశాభంగమయింది. రైతు తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. కమలుడు చేసిన పని తలుచుకుని రైతు భార్యకు గుండె చితికినట్టయింది.

''వాణ్ణి ఎంత ప్రేమగా పెంచుతున్నాం! తండ్రికే గొయ్యి తవ్వుతాడా? ఇక వాడి ముఖంచూసేదెట్లా?'' అన్నదావిడ భర్తతో.

''నా తండ్రి నన్ను గారాబంగా పెంచలేదా? నేను చేద్దామనుకున్నదేమిటి? మన కొడుక్కు మన మీద అపేక్షలేక కాదు. మనకు గుణపాఠం నేర్పటానికి అట్లా చేశాడు! ఇకనైనా వాణ్ణి చూసి బుద్ధి కలిగి ఉందాం!'' అన్నాడు రైతు.

తరవాత కమలుడి తండ్రిగాని, తల్లిగాని ఎటువంటి నీచకార్యానికీ పూనుకోలేదు.





# రామాయణం

తార లక్ష్మణుడికి అడ్డం వచ్చి, ''లక్ష్మణా, తొందరపడి సుగ్రీవుణ్ణి నిందించ వద్దు. అతను రామ కార్యం ఏమరలేదు. వానరులందరూ పదిహేను రోజులలో రావాలనీ, రాని వారికి మరణశిక్ష అనీ సుగ్రీవుడు అదివరకే ప్రకటించాడు. ఈవాళే గడువు ఆఖరు రోజు. అన్న ఆగ్రహానికి గురై అడవులలో చాలాకాలం కష్టాలు అనుభవించిన సుగ్రీవుడు ఇప్పుడు భోగలాలసుడై ఉన్న మాట నిజమే. అయినా దానిని క్షమించ వచ్చు. అందుచేత నువ్వు కోపం మాను,'' అన్నది.

తార మాటలతో లక్ష్మణుడు మెత్తబడ్డాడు. అది చూసి సుగ్రీవుడికి కాస్త ధైర్యం వచ్చింది. అతను లక్ష్మణుడితో, ''లక్ష్మణా, రాముడు నాకు చేసిన మహోపకారంలో నేనాయనకు చెయ్యబోయేది ఏపాటి? రాముడిపట్ల నాకున్న చనువుకొద్దీ నేను కొంచెం జాప్యం చేసి ఉంటే నన్ను క్షమించాలి. ఆగ్రహించ కూడదు. లోకంలో తప్పు చెయ్యనివాడు ఉండడు గద,'' అన్నాడు ఎంతో వినయంగా.

దానికి లక్ష్మణుడు, ''సుగ్రీవా, నీ సహాయం మాకు దేవతలు చేసే సహాయమే. నువ్వు ఒకసారి వచ్చి ఎంతో దుఃఖంలో ఉన్న రాముణ్ణి ఊరడించు. ఆయన దుఃఖం చూడలేకనే నేను ఆగ్రహం చెందాను, నన్ను క్షమించు,'' అన్నాడు.

సుగ్రీవుడు హనుమంతుడి కేసి తిరిగి, ''వానరుల నందరినీ పిలుచుకు రమ్మని నేనింతకు ముందే దూతలను పంపాను. వారి వెనక ఇప్పుడు మరికొందరు వానరులను

కిష్కింధా కాండ-5

పంపి, అనేక పర్వతాలలోనూ, సముద్ర తీరాలా, వనాలలోనూ ఉండే రకరకాల వానరులు శీఘ్రంగా వచ్చి చేరే ఏర్పాటు చెయ్యి. వారిని రప్పించటానికి సామ దానాది ఉపాయాలు ప్రయోగించు. పది రోజుల లోగా రాని వానరులకు మరణ శిక్ష! ఇది నా ఆజ్ఞ!'' అన్నాడు.

అలాగే హనుమంతుడు అనేకమంది వానరులను అనేక దిక్కులకు పంపాడు. క్రమంగా వానర బలగాలు కిష్కింధకు రాసాగాయి. నల్ల కోతులు, పచ్చ కోతులు, తెల్ల కోతులు, భయంకరమైన ఎర్ర కోతులు- అన్ని రకాల కోతులూ వచ్చాయి. వానరులు తాముండే చోట దొరికే పళ్ళూ, సువాసన గల పూలూ కూడా తెచ్చారు; వాటిని సుగ్రీవుడికి కానుకగా ఇచ్చారు.

తమ నిమిత్తమై పెద్ద ఎత్తున పని ప్రారంభించిన సుగ్రీవుడి పైన భక్తి విశ్వాసాలేర్పడి లక్ష్మణుడు అతన్ని తాముండే చోటికి ఆహ్వానించాడు. సుగ్రీవుడు సమ్మతించి, తన పల్లకి తెప్పించి, అందులో లక్ష్మణుణ్ణి ఎక్కమని, అతనితోబాటు తాను కూడా ఎక్కి కూచుని, రాముడుండే చోటికి మేళ తాళాలతో బయలు దేరాడు. వానరులతనికి తెల్లగొడుగు పట్టారు, వింజామరాలు వీచారు, శంఖ ధ్వానాలు చేశారు, భేరీ భాంకారాలు మోగించారు, స్తోత్ర పాఠాలు దారి పొడుగునా చదివారు. కొన్ని వందలమంది వానర వీరులు అమితోత్సాహంతో పల్లకి వెంట నడిచారు.

ప్రస్రణ పర్వతం మీది గుహవద్ద పల్లకి దిగింది. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకి దిగి రాముణ్ణి సమీపించి, చేతులు పైకెత్తి





నమస్కారం చేసి నిలబడ్డాడు. మిగిలిన వానరులంతా అలాగే చేతులు పైకెత్తి నమస్కారాలు చేస్తూ నిలబడ్డారు. వారి చేతులు రాముడికి చెరువులోని తామర మొగ్గల్లాగా కనిపించాయి.

రాముడు సుగ్రీవుణ్ణి సమీపించి, అతను సాష్టాంగ పడగా లేవనెత్తి ఆలింగనం చేసుకుని, లాంఛనగా సహాయం అడిగాడు. దానికి సుగ్రీవుడు, ''రామా, నా దూతలు పిలవగా ప్రపంచంలోని అన్ని మూలల నుంచీ మహా పరాక్రమవంతులైన వానరులు వేల, లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారు రావణాసురుణ్ణి చంపి, సీతను నీకు తెచ్చి ఇవ్వటానికి సమర్థులు,'' అన్నాడు.

రాముడీ మాటకు సంతోషించి, ''సుగ్రీవుడా, నీ వంటి వాడి సహాయంతో నేను రావణుణ్ణి అవలీలగా చంపి సీతను తెచ్చుకోగలను,'' అన్నాడు.

ఇంకా కిష్కింధా పరిసరాలలో దుమ్ము లేస్తూనే ఉన్నది, భూమి కంపిస్తూనే ఉన్నది. వానరులింకా వస్తూనే ఉన్నారు. తార తండ్రి సుషేణుడు పది వేల కోట్ల వానరులతో వచ్చాడు. సుగ్రీవుడి మామా, రుమ తండ్రీ అయిన తారుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. హనుమంతుడి తండ్రి కేసరి ఇరవైయొక్క వేల ఎనిమిది వందల డెబ్భై మంది వానరులతో వచ్చాడు. గోలాంగూలాలకు రాజయిన గవాక్షుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. ధూమ్రుడనేవాడు రెండువేల కోట్ల భల్లూకాలను తెచ్చాడు. ఇదే విధంగా పవనుడూ, నీలుడూ, గవయుడూ, దరీముఖుడూ, అశ్వనీ దేవతల కొడుకులైన మైంద ద్వివిదులూ, గజుడూ, జాంబవంతుడూ, రుమణ్వంతుడూ, గంధమాదనుడూ, అంగదుడూ మొదలైనవారు అంతులేని బలాలను వెంట తెచ్చారు. ఈ వానరుల నందరినీ ఫల వృక్షాలు సమృద్ధిగా వున్న వనాలలోనూ, సెలయేళ్ళ దగ్గిరా, కొండల వద్దా విడియింపజేశారు. సుగ్రీవుడు ఈ వానర బలాలన్నిటినీ రాముడి పరం చేసి, వారిని కావలిసిన విధంగా ఉపయోగించుకోమని చెప్పాడు.

''సుగ్రీవుడా, ముందుగా మనకు రెండు విషయాలు తెలియాలి. సీత బ్రతికి ఉన్నదా, లేదా అన్నది మొదటి విషయం. రెండో విషయం రావణుడి వాస స్థల మెక్కడ అన్నది. ఈ రెండు వార్తలూ తెలిసినాక నిర్వర్తించ



వలసినకర్తవ్యం నిర్ణయింతాం. ఈ వార్తలు సేకరంచటానికి నేనూ, లక్ష్మణుడూ సమర్థులం కాము. ఆ పని నీ వల్లనే జరగాలి,'' అని రాముడన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు వినతుడనే వానర నాయకుణ్ణి పిలిచి, ''నువ్వు లక్ష వానరులను తీసుకుని తూర్పు దిక్కుగా వెళ్ళు. రావణుడుండే చోటు తెలుసుకుని సీత యొక్క స్థితిగతులు కనుక్కునిరా,'' అన్నాడు.

ఇలా సీతను వెదకబోయేవారు నెల రోజుల లోపుగా తిరిగి రావాలనీ, రానివారికి మరణ దండన విధించబడుతుందనీ సుగ్రీవుడు హెచ్చరించాడు.

తరవాత అతను నీలుణ్ణీ, హనుమంతుణ్ణీ, మహాబలుడు జాంబవంతుణ్ణీ, మహోత్రుణ్ణీ, శరారినీ, శరగుల్మణ్ణీ, గజుణ్ణీ, గవాక్షుణ్ణీ, గవయుణ్ణీ, ఋషభుణ్ణీ, మైందుణ్ణీ, ద్వివిదుణ్ణీ, విజయుణ్ణీ, గంధమాదనుణ్ణీ, ఉల్కాముఖుణ్ణీ, అసంగుణ్ణీ, అంగదుణ్ణీ, మరికొందరు వానర వీరులనూ దక్షిణ దిశ అంతా వెదకమన్నాడు. అతను వారికి దక్షిణానగల దేశాలన్నీ వివరించి, ''మీరు దక్షిణ తీరం చేరినాకసముద్రం మీదుగా పోయే ఉపాయం ఆలోచించుకోండి. ఎందుకంటే సముద్రంలో నూరు యోజనాల వైశాల్యం గల లంక ఉన్నది. అదే రావణుడి నివాస స్థానం. సీత కోసం అక్కడ చక్కగా వెతకండి. సముద్రంలో ఇంకా పర్వతాలున్నాయి. వాటన్నిటిమీదా మీరు సీతాదేవిని వెదకండి. దక్షిణ దిక్కుగా ఇంకా ఏయే రహస్య ప్రదేశాలున్నా వాటి నన్నిటినీ గాలించండి. నెల లోపలగా ఎవడైతే తిరిగి వచ్చి, 'చూశాను సీతను' అని చెబుతాడో వాడికి నాతో సమమైన భోగభాగ్యాలు కలుగుతాయి. వాణ్ణి నా ప్రాణాలకన్న ఎక్కువగా చూసుకుంటాను,'' అని వానరులతో అన్నాడు.

ఇదే విధంగా సుగ్రీవుడు పడమటి దిక్కుగా తార తండ్రి అయిన సుషేణుడు మొదలైన వారిని రెండు లక్షల వానర బలగంతో పంపాడు. లక్షమంది వానర వీరులతో సహా శతవలి అనే వాణ్ణి ఉత్తరంగా పంపాడు.

ఇంతమంది వానరులను అన్ని దిశలకూ పంపుతున్నప్పటికీ సుగ్రీవుడి ఆశలన్నీ హనుమంతుడిపైనే ఉన్నాయి. అందుచేత అతను హనుమంతుడితో, ''నువ్వు భూమిపైనా; నీటిలోనూ, గాలిలోనూ పయనించ గలవాడివి–

మూడు లోకాలూ తెలిసిన వాడివి. నీ తండ్రి వాయుదేవుడికి ఉన్నంత అద్భుత ప్రతిభ నీకూ ఉన్నది. అందుచేత సీతాదేవి దొరకటా నికి అవసరమైన ప్రయత్నమంతా నువ్వే చెయ్యాలి,'' అన్నాడు.

ఈ మాటలు వినగానే రాముడు హనుమం తుడి యందు సుగ్రీవుడికి ఎంత నమ్మక మున్నదీ గ్రహించాడు. హనుమంతుడే పని సాధించుకురాగలడేమోనన్న ఆశ రాముడిలో కూడా తల ఎత్తింది. అందుచేత తన పేరుగల ఉంగరాన్ని తీసి, సీతాదేవికి గుర్తుగా ఉండ గలందులకై హనుమంతుడి కిచ్చాడు. అతను హనుమంతుడితో, ''సీత ఈ ఉంగరం చూసి నట్టయితే నిన్ను విశ్వసిస్తుంది, భయపడ కుండా ఉంటుంది,'' అని చెప్పాడు.

హనుమంతుడా ఉంగరాన్ని నెత్తిన పెట్టు కుని రాముడికి నమస్కారం చేసి బయలు దేరాడు.

''హనుమంతుడా, నా ఆశలన్నీ నీపైనే పెట్టుకుని ఉన్నాను. నీ శక్తికొద్దీ ప్రయత్నించి ఎలాగైనా సీత దక్కేటట్టు చెయ్యాలి,'' అని రాముడు హనుమంతుడితో చివరి మాటగా అన్నాడు.

హనుమంతుడు తన జట్టు వానరులతో బయలుదేరి వెళ్ళాడు. అలాగే అన్ని దిక్కు లకూ వానర సమూహాలు బయలుదేరి వెళ్ళాయి. వారు తిరిగి రావటానికి ఒక్క నెల గడు విధ్వబడింది. ఈ నెల రోజులూ సీత వార్తకై ఎదురు చూస్తూ రాముడు లక్ష్మణుడితో సహా ప్రస్రవణ పర్వతం పైనే గడిపాడు. సుగ్రీ



వుడు తన విధిని నెరవేర్చినవాడై పెద్ద బరువు దిగి పోయినట్టు సంతోషించాడు.

సుగ్రీవుడి చేత వేరువేరు దిక్కులకు పంపబడిన వానరులు సీత కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు పగలంతా వేరు వేరు స్థలాలకు వెళ్ళి వెతుకుతూ, రాత్రి పూట ఏ పళ్ళ తోటల్లోనో తిరిగి కలుసుకుని నిద్ర పోతూ నెల రోజులూ వెతికారు. నెల పూర్తి అయ్యేసరికి తూర్పు నుంచీ, పడమటి నుంచీ, ఉత్తరం నుంచీ వానరులు తిరిగి వచ్చి, తమకు సీత జాడ తెలియరాలేదని సుగ్రీవుడితో చెప్పుకున్నారు.

ఇక దక్షిణంగా బయలుదేరిన వానర వీరులు సీతను వెదుకుతూ చాలా దూరం వెళ్ళి వింధ్య పర్వతాన్ని చేరుకున్నారు. వింధ్య పర్వతం సామాన్యమైన పర్వతం కాదు. దానిపై ఎన్నో శిఖరాలు, ఎన్నో గుహలు! దాని పరిసరా లలో ఎన్నో నదులు, ఎన్నో దుర్గమారణ్యాలు! వానరులు ఎంతో ఓపికగా ప్రతి ప్రదేశమూ వెతికారు.

ఒక చోట వారికి ఒక భయంకరుడైన రాక్ష సుడు కనిపించాడు. వాడే రావణుడై ఉంటా డనుకుని అంగదుడు వాణ్ణి ఒక్క దెబ్బతో నెత్తురు కక్కి చచ్చేట్టు చేశాడు. ఆ సమీపంలో సీత ఉంటుందేమోనని వెతికారు. కాని వారి ఆశ ఫలించలేదు.

చిట్టచివరకు అందరూ అలిసిపోయి ఒక చెట్టు కింద కూచున్నారు. అప్పుడు అంగ దుడు మిగిలిన వాళ్ళతో, ''సీత కోసం మనం పడిన శ్రమ ఇంతవరకు ఫలించ లేదు. రోజులా చాలా గడిచాయి. సుగ్రీవుడు తీవ్రంగా దండించే మనిషి. అందుచేత మనం మరింత ఒళ్ళు వంచి వెతకాలి, నిద్రకూడా మానాలి,'' అన్నాడు.

గంధమాదనుడు కూడా అంగదుడి అభి ప్రాయాన్ని బలపరిచాడు. ఆకలి దప్పులతో ఆర్చుకు పోతున్న గొంతుతో అతను, ''సుగ్రీ వుడి ఆజ్ఞ ప్రకారం అందరూ సమస్త వనాలూ, పర్వతాలూ, గుహలూ, బిలాలూ సీత కోసం వెతకండి,'' అన్నాడు.

వెంటనే వానరులంతా లేచి వింధ్యారణ్యా లన్నీ సీత కోసం గాలించ సాగారు. వారా పర్వతమంతా గాలించే లోపలనే నెల రోజుల గడువు పూర్తి అయిపోయింది.





# రాజుగారి పోటీలు

ఒకప్పుడు కాంభోజరాజ్యాన్ని కుమారవర్మ పాలించాడు. తాను అన్ని విద్యలలోనూ సాటి లేని మేటి అనీ, ప్రజారంజకంగా రాజ్యం చేయడంలో తనకు తానే సాటి అనీ ఆయ నకు గట్టి నమ్మకం.

ఒకసారి అయన భార్య కర్పూరవల్లి తన భర్తతో ఛలోక్తిగా వారసత్వంతో రాజుకావడం విశేషం కాదనీ, స్వశక్తితో రాజ్యాన్ని సంపాదిం చుకోవడమే గొప్ప అనీ అన్నది. రాణి ఈ మాటలు పరిహాసానికి అన్నప్పటికీ, కుమార వర్మ మీద అవి బాగాపనిచేశాయి. తన గొప్ప తనం రాణీకి రుజువుచెయ్యాలని ఆయన అనేకరంగాలలో పోటీలు ఏర్పాటుచేశాడు.

ఆ పోటీలలో పాల్గొనడానికి దేశం అన్ని ప్రాంతాల నుంచీ ఉత్సాహవంతులైన యువ కులూ, శక్తిమంతులూ వచ్చారు. ఆయా రంగా లలో ప్రవీణులైనవారు నిర్ణేతలుగా పని చేశారు. పోటీలు జయప్రదంగా ముగిశాయి. బహుమతి ప్రదానం జరగవలసి ఉన్నది.

కుమారవర్మ, కత్తియుద్ధంలో ఉత్తముడుగా నిర్ణయించబడిన రామరాజు అనే అతన్ని చూపి, ''మన దేశంలో ఇంతకు మించిన ఖడ్గయుద్ధ నిపుణుడు లేడని తేలిందిగదా?'' అన్నాడు. సభలో అందరూ అవునన్నారు.

''ఆ సంగతి నేను తేల్చాలి,'' అంటూ రాజు కత్తి చేతబట్టి రామరాజుతో యుద్ధానికి వచ్చాడు. అందరూ ఆశ్చర్యపోయారు. రామ రాజుకూ, కుమార వర్మకూ చాలాసేపు తీవ్ర పోరాటం జరిగింది. చివరకు రామరాజు కుమారవర్మ చేతి కత్తిని ఎగరగొట్టేశాడు. కుమారవర్మ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు.

ఇంతలో నిర్ణేతలు ముందుకు వచ్చి, రామరాజు నియమాలను ఉల్లంఘించాడ

**25-ఏళ్ళనాటి చందమామ కథ**



న్నారు. వాళ్ళు రామరాజుకు రహస్యంగా ఏదో చెప్పారు. రామరాజు కుమారవర్మ వద్దకు వచ్చి, చేతులు జోడించి, ''ప్రభూ, మీ చాకచక్యానికి తట్టుకోలేక నియమాలు కొన్నిటిని తప్పాను. తమతో మరొకసారి యుద్ధం చేసే అవకాశం ఇప్పించండి,'' అన్నాడు.

ఈసారి కుమారవర్మ రామరాజు చేతి కత్తిని అతి శీఘ్రంగా ఎగరగొట్టేశాడు. బహుమతి రాజుకు లభించింది.

ఇదేవిధంగా సాహిత్యగోష్ఠిలో అందరినీ ఓడించిన విద్యానాథుణ్ణి రాజు సవాలు చేశాడు. ఇద్దరూ చర్చ జరుపుతూండగా మధ్యలో నిర్ణేతలు విద్యానాథుడిలో వ్యాకరణ దోషాలు కలిగాయని, బహుమతి రాజుకే నిర్ణయించారు.

ఒకటేమిటి? అన్ని రంగాలలోనూ రాజు బహుమతులను ఇలాగే సంపాదించుకున్నాడు. ఇలా ఒకసంవత్సరం కాదు, అయిదు సంవత్సరాలపాటు కుమారవర్మ తాను ఏర్పాటు చేసిన పోటీలన్నిటిలోనూ తానే బహుమతులు పొందాడు. ఆయన ఈ సంగతి గర్వంగా తన భార్యకు చెబితే, ఆమె నవ్వి ఊరుకున్నది.

ఇలా ఉండగా కుమారవర్మకు ఒక దారుణ వార్త తెలిసింది. మంత్రి భైరవుడు రాజ్యాన్ని కాజేసేటందుకు కుట్ర చేస్తున్నాడు. ఆయన పథకం దాదాపు పూర్తి అయింది.

ఈ వార్త తెలియగానే కుమారవర్మ, తన భార్యతో సహా రహస్యమార్గాన తప్పించుకుని, మారువేషాలతో నగరం విడిచి పారిపోయాడు. ఇక రాజు మామూలు మనిషే గనక, మంత్రి నిశ్చింతగా రాజ్యాభిషేకం చేసుకున్నాడు.

కుమారవర్మా, కర్పూరవల్లీ ఒక మారుమూలగ్రామం చేరి, మారు పేర్లు పెట్టుకుని, పేదవాళ్ళ దుస్తులు ధరించి, కాయకష్టం చేసుకుని బతకసాగారు. ప్రజలమధ్య బతకటం ప్రారంభించినాక కుమారవర్మకు ప్రజల అవసరాలూ, కష్ట సుఖాలూ బాగా తెలిసి వచ్చాయి. ఎందుకంటే, అవి ఇప్పుడు తనవి కూడానూ. తన పరిపాలన తాను అనుకున్నట్టు ప్రజారంజకంగా ఉండి ఉండలేదనీ, తన పాలనలో ప్రజలకు అన్యాయం చాలా జరిగిందనీ ఆయనకు ఇప్పుడు తెలిసివచ్చింది.

ఆ సంవత్సరం కూడా రాజధానిలో ఎప్పటిలాగే పోటీలు జరుగుతాయని తెలిసి ఆయనకు చాలా ఉత్సాహం కలిగింది. అయితే, ఆ పోటీలను గురించి యువకులలో ఎలాటి ఉత్సాహమూ లేక పోవటం చూసి ఆశ్చర్య

పడి, చాలామందిని కారణం అడిగితే, ''ఎందు కొచ్చిన పోటీలు? బహుమతులు రాజుగారికే గద!'' అన్నారు పెదవి విరుస్తూ.

తన ప్రతిభను ప్రజలు గుర్తుంచుకున్నార నుకుని కుమారవర్మ సంతోషించాడు. కాని ఇప్పుడు రాజు భైరవుడు మంత్రాలోచనలో తప్ప ఇంకెందులోనూ సామర్థ్యం గలవాడు కాడు. ఆ కారణం చేత కుమారవర్మ పోటీ లలో పాల్గొని, బహుమానాలు పొందుదామని రాజధానికి బయలుదేరి వెళ్ళాడు.

పోటీకి వచ్చిన వారి శక్తి సామర్థ్యాలు చూస్తుంటే కుమారవర్మకు ఆశ్చర్యం కలిగింది. దేశం బొత్తిగా చచ్చుపడిపోయినట్టున్నది. కుమారవర్మ చాలా రంగాలలో నెగ్గాడు.

అన్ని రంగాలలోనూ గెలిచిన వారిని చిట్ట చివరకు, రాజైన భైరవుడు సవాలు చేశాడు. అతనికీ, కుమారవర్మకూ కత్తి యుద్ధం జరిగింది. కుమారవర్మ కొద్ది క్షణాలలోనే భైరవుణ్ణి నిరాయుధుడిగా చేశాడు. వెంటనే నిర్ణేతలు కలగ జేసుకుని, కుమారవర్మ నియమోల్లంఘన చేశాడనీ, లేకపోతే విజయం భైరవుడిది అయి ఉండేదనీ అన్నారు. వాళ్ళు కుమారవర్మను అవతలికి తీసుకుపోయి, ''వెర్రివాడా, నువ్వు పోటీ చేస్తున్నది ఒక వ్యక్తితో కాదు, ఒక గొప్ప పదవితో! నువ్వు ఓడిపోవలసినది భైరవుడికి కాదు, సింహాస నానికి! రాజును క్షమాపణ కోరి, మరొక పోరాటానికి అవకాశం వేడుకుని, ఈసారి ఓడిపో! లేకుంటే ప్రమాదంలో పడగలవు,'' అన్నారు. గత్యంతరం లేక కుమారవర్మ వాళ్ళు



చెప్పినట్టే చేసి, రెండోసారి భైరవుణ్ణి గెలవ నిచ్చాడు. తాను రాజుగా ఉంటూ బహుమా నాలందుకోవటంలో ఉండిన రహస్యం కుమారవర్మకు అర్థమయింది.

అతను గ్రామానికి తిరిగి రాగానే కొంత మంది అతనితో, ''ఏమయింది? అన్ని రంగాల్లోనూ భైరవమహారాజే గెలిచాడా? ఈ భాగ్యానికి శ్రమపడి రాజధానికి ఎందుకు వెళ్ళావు? నీకు బహుమతే కావాలంటే నువ్వు రాజువు కావాలి,'' అన్నారు.

భైరవుడి పరిపాలనలో ప్రజాపీడన అంత కంతకూ హెచ్చిపోతున్నది. అది గ్రహించి కుమారవర్మ ఉత్సాహధైర్యాలు గల యువకు లను తనతో చేర్చుకుని, రహస్య సైన్యాన్ని తయారు చేసుకున్నాడు. ఆ సైన్యానికి నాయ కుణ్ణి ఎన్నుకోవటానికి యువకుల మధ్య పోటీలు జరిగాయి. అమిత ఉత్సాహంతో

జరిగిన యుద్ధ విద్యల పోటీలన్నిటిలోనూ కుమారవర్మ నెగ్గి, సేనా నాయకుడుగా ఎన్నుకో బడ్డాడు.

తిరిగి రాజ్యాన్ని సంపాదించటానికి కుమార వర్మ తీవ్రంగా ఆలోచించి ఒక పథకం ఆలో చించాడు. మరుసటి ఏడు జరిగిన పోటీలకు కుమారవర్మ తన సైన్యాన్ని వెంటబెట్టుకుని వెళ్ళి, యుద్ధవిద్యలకు సంబంధించిన పోటీలన్నిటా నెగ్గాడు.

తరవాత భైరవుడు అతన్ని కత్తి యుద్ధంలో సవాలు చేశాడు. కుమారవర్మ అతి సులువుగా భైరవుడి చేతి కత్తిని ఎగరగొట్టి, తన కత్తిని భైరవుడి గుండెలకు ఆనించి, అక్కడ చేరిన ప్రజలతో, ''ఈ దుర్మార్గుడు నన్ను చంపాలని చూశాడు, కాని విశ్వాసపాత్రులు హెచ్చరించటం వల్ల నేను ప్రాణాలతో బయటపడ్డాను. నేను ఒకప్పుడు మీ రాజును, కుమారవర్మను. ఈ భైరవుడు ప్రజారంజకంగా మిమ్మల్ని పరిపాలించి ఉంటే నేను కలుగజేసుకుని ఉండను. ప్రజల క్షేమం కోసమే నేను ముందుకు వచ్చాను. నన్ను తిరిగి రాజుగా మీరు ఆమోదిస్తారా? లేక సింహాసనం కోసం యుద్ధం చెయ్యాలా?'' అంటూ తన మారువేషం తొలగించాడు.

సభికులు జయజయధ్వానాలు చేశారు. రక్తపాతం అవసరం లేకుండానే రాజ్యం తిరిగి కుమారవర్మ వశమయింది.

తిరిగి రాణి అయిన కర్పూరవల్లి తన భర్తతో, ''మీరే కుమారవర్మ అని మన సైన్యానికి తెలియనిచ్చి ఉంటే మీరు ఎప్పుడో రాజు అయ్యేవారుగదా?'' అన్నది.

''ఈసారి రాజ్యాన్ని వారసత్వంగా కాక, స్వశక్తితో సంపాదించదలిచాను. ఇప్పుడు నా శక్తిలో నాకు నమ్మకం కలిగింది గనక, నేను నిర్వహించే పోటీలలో నేను పాల్గొనే అవసరం లేదు,'' అన్నాడు కుమారవర్మ.

తరవాత ఆయన ప్రజాజీవితం నుంచి నేర్చుకున్న అనుభవంతో ప్రజారంజకంగా పాలించాడు. ఆయన పాల్గొనటం మానటం చేత ఆయన యేటా నిర్వహించే పోటీలు నిజమైన శక్తి సామర్థ్యాలు గలవాళ్ళను ఎంతగానో ఆకర్షించాయి.



చిత్రాలు: గాంధి అయ్య 26

# అజేయుడు గరుడుడు!



అరుణ మహారాజుతో కలిసి చంద్రపురికి బయలుదేరాక, ఆదిత్యుడు వజ్రపురిక తిరుగు ప్రయాణమయ్యాడు. హెచ్చరిస్తున్నట్టు డేగ అతడి భుజం మీద వాలింది. ధీరసేనుడితో చర్చలు జరుపుతూన్న పుష్పరాజ్ మీదికి డేగ దాడి చేయడంతో అతడు హడలిపోయి ధీరసేనుడికి లొంగిపోయాడు.
















నాక్షేమం పట్ల నువ్వు చూపుతున్న శ్రద్ధ మెచ్చతగినది.
త్వరలో విజయం మీ వశం కావాలి!


ఆదిత్యుణ్ణి త్వరలో పట్టుకోండి!
రవీంద్రా, మీ తండ్రిని ఆయన గురువుగారి అద్భుత శక్తులను ఉచ్చాటనం చేయమని చెప్పు.


రాజు విక్రమసింహుడు, కోయ యువకులు కొండ ప్రాంతాన్ని దాటి వెళ్ళారు.


కొందరు సూర్యపురి సైనికులతో ఆదిత్యుడు కొండ గుహల కేసి బయలుదేరాడు.


వాళ్ళు గుహాలయ ప్రాంగణాన్ని సమీపించారు.
దళపతీ, సైనికులు గుహాలయ మార్గాలకు కాపలా కాయాలి!
చిత్తం, యువరాజా! నేను వారికి సూచనలిస్తాను.


నేను వెళ్ళి, మన సరిహద్దుల నుంచి వజ్రపురి సైన్యం ఉపసంహరించుకునేలా చూస్తాను.
చిత్తం, యువరాజా!


సూర్యపురి సైనికులు గుహాలయానికి వెళ్ళే మార్గాలను, వచ్చే మార్గాలను కాపలా కాయసాగారు.


విక్రమసింహుడు, కోయ యువకులు అడవిలోకి ప్రవేశిస్తూండగా రివ్వురివ్వుమంటూ బాణాలు దూసుకు రాసాగాయి.


ప్రభూ! నన్ను పట్టుకోండి. జాగ్రత్తగా కిందికి దిగండి.
HA! AHGH!


మిత్రమా! ఆలస్యం చేయకు. రాజును వెంటనే ఇక్కడి నుంచి తీసుకువెళ్ళు! త్వరగా!
ప్రభూ! లేవండి! త్వరగా వెళ్ళిపోదాం.


విక్రమసింహుణ్ణి, యువకుడు తన గుర్రం మీద కూర్చోబెట్టుకుని బయలుదేరాడు.


కోయదంపతులు తనకేసి పరిగెత్తుకు రావడం చూసిన ఆదిత్యుడు ఆగాడు.
ఆ ఇద్దరే ఒకప్పుడు గుహాలయంలో జరుగుతూన్న నరబలుల గురించి నాకు చెప్పారు!


దొరా! ఇద్దరు యువకులు,
రాజులాంటి ఒక వ్యక్తి గుహల నుంచి వెలుపలికి రావడం చూశాం.
ఆ సంగతి మీకు చెప్పడానికే వచ్చాం!
వాళ్ళు నాగబంధు ముఠాకు చెందిన వాళ్ళు. మునుపటిలాగే నరబలులు కొనసాగిస్తున్నారు దొరా!
ఆ తరవాత ఏం జరిగింది?


ఒక యువకుడూ, రాజూ బాణాల దెబ్బలు తగిలి కింద పడిపోయారు. బాణం దెబ్బ తగలని యువకుడు రాజును గుర్రం మీదికి ఎక్కించుకుని ఆలయంకేసి దౌడు తీశాడు.


మరి గాయపడ్డ యువకుడు ఏమయ్యాడు?
మా యువకులు అతనికి చికిత్సచేయడానికి గూడెంలోకి తీసుకువెళ్ళారు.
అతన్ని ఒక గుడిసెలోకి తీసుకువెళ్ళి ఉండవచ్చు!


అతన్ని నేను చూడాలి.
మాతోరండి... అక్కడికి తీసుకువెళతాం.


మీరిద్దరూ ఇక్కడే వేచి ఉండండి. వస్తాను.
ఇలా...రండి! దొరా!


గాయపడ్డ యువకుడికి ఎవరో కట్టుకడుతూండడం ఆదిత్యుడు చూశాడు.
-(ఇంకావుంది)

మన వారసత్వ స్థలాలు

# అజంతా గుహలు

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన అజంతా గుహలు మహారాష్ట్ర ఔరంగబాదుకు వంద కి.మీ. దూరంలో ఉన్నాయి. ఏసుక్రీస్తు జన్మించడానికి రెండు వందల సం.లకు పూర్వం నిర్మించబడ్డ ఈ గుహలను మొదట బౌద్ధ భిక్షువులు తమ నివాసస్థానాలుగా చేసుకున్నారు. ప్రార్థనలు పూర్తయ్యాక భిక్షువులు విరామ సమయాన్ని గుహలోని లోపలి కుడ్యాలను చిత్రాలతో అలంకరించడానికి వినియోగించేవారు. గౌతమ బుద్ధుడి జీవిత విశేషాలను, ఆయన పూర్వ జన్మల వృత్తాంతాలను అందమైన చిత్రాలుగా చిత్రించారు. వాటిని చిత్రించి వందలాది సంవత్సరాలు గడిచి పోయినప్పటికీ రంగులు అలాగే ఉండడం విశేషం. కొన్ని చిత్రాల రంగులు వెలిసిపోతున్నట్టు తెలియగానే వాటిని నిలుపుకోవడానికి తగిన చర్యలు చేపట్టారు.

1819వ సం.లో కొందరు బ్రిటిష్ వేటగాళ్ళు ఈ గుహలను కనుగొన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ ఈ చిత్రాల కాపీలు తీయడానికి ఏర్పాట్లు చేసింది.

ఇక్కడ ముప్పై గుహలు ఉన్నాయి. ఐదు గుహలు చైత్య గృహాలుగానూ, తక్కినవి విహారాలుగానూ పిలువబడుతున్నాయి. ఈ గుహలను పెద్ద పెద్ద బండలలో తొలిచారు. ద్వారాలను శిల్పాలతో అలంకరించారు.



1983వసం.లో యునెస్కో అజంతా గుహలను, ''బౌద్ధ మతానికి సంబంధించిన కళాఖండాలుగా,'' అభివర్ణిస్తూ ప్రపంచవారసత్వస్థలాల జాబితాలోకి తీసుకున్నది.

# వార్తలలో బాలలు

## అంతర్జాతీయ గుర్తింపు



జయ్‌పూర్‌లో బచ్‌పన్ బచావో ఆందోళన్ (బిబిఎ) సంస్థ నడుపుతున్న బాలల అనాథ శరణాలయంలో కొన్నేళ్ళక్రితం బుండీ, ఓం ప్రకాష్, అమర్‌లాల్ అనే ముగ్గురు కుర్రాళ్ళు ఉండేవారు. బాలకార్మికులుగా పని చేస్తున్న ఆ ముగ్గురినీ విడిపించి తెచ్చి అనాథ శరణాలయంలో చేర్చారు. ఆ ముగ్గురికి కూడా ఇటీవల అంతర్జాతీయ గుర్తింపు లభించడం చెప్పుకోతగ్గ విశేషం.

పద్నాలుగేళ్ళ బుండీకి పోగో కిడ్స్ అవార్డ్ లభించింది. అతడు అనాథశరణాలయం నుంచి ఇల్లు చేరాక, అరవై మంది పిల్లలను బడిలో చేర్పించడమే కాకుండా వాళ్ళ చదువుకు ఆర్థికసాయం లభించడానికి కృషిచేశాడు. పదిహేనేళ్ళ ఓంప్రకాష్ 2007సం. ఇంటర్నేషనల్ చిల్డ్రన్స్ పీస్ అవార్డు అందుకున్నాడు. రాజస్థాన్‌లో ఉచిత విద్యావిధానం అమలులో ఉన్నప్పటికీ ఒక పాఠశాలలో విద్యార్థుల నుంచి డబ్బులు వసూలు చేయడాన్ని వ్యతిరేకిస్తూ ఓంప్రకాష్ ఉద్యమం లేవదీశాడు. ఆ తరవాత ఈ సమస్యను రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ చేపట్టింది.

యునెస్కో ఆధ్వర్యంలో జరుగుతూన్న ఒక విద్యాసదస్సులో పాల్గొనడానికి అమర్‌లాల్‌కు ఆహ్వానం అందింది. బాలకార్మిక వ్యవస్థ, బాలల విద్యా హక్కులు వంటి విషయాల మీద అతడు ఉపన్యసించనున్నాడు.

## చెస్ ఛాంపియన్



గత డిసెంబర్‌లో ఢిల్లీలో జరిగిన కామన్వెల్త్ చెస్ ఛాంపియన్ షిప్ పోటీల్లో ఎనిమిదేళ్ళలోపు బాలికల కేటగిరీలో కాలికట్‌కు చెందిన సి.హెచ్. మేఘన బంగారు పతకం సాధించింది. ఎక్కువ మంది పోటీదారులు లేకపోవడంతో మేఘన ఓపెన్ కేటగిరీలో చేర్చుకోబడింది. నాలగవ తరగతి చదువుతూన్న ఈ అమ్మాయి తన నాలగవ యేట నుంచే చెస్ ఆడుతోంది. ఆమె ఛాంపియన్‌షిప్‌ను సాధించడానికి 10 ఆటలలో 4 పాయింట్లు స్కోర్‌చేసి మూడు ఆటలలో డ్రూఇన్ అయింది.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### నక్షత్రాల కేటలాగ్

రాత్రుల్లో ఆకాశం కేసి చూసే అలవాటు మీకు ఉందా? మెరిసే కోటాను కోట్ల నక్షత్రాలు. మెల్లగా సాగే చందమామ. అదో అద్భుత దృశ్యం. మనం ఇవాళ టీవీలు చూస్తున్నట్టు ఒకప్పుడు మన పూర్వులు నక్షత్రాల ఆకాశాన్ని ఆసక్తితో చూసేవారు. నక్షత్రాల గురించి శాస్త్రబద్ధంగా కేటలాగ్ రూపొందించినవారెవరో మీకు తెలుసా? చైనా దేశస్థులు! క్రీ.పూ. 4వ శతాబ్దంలో షిహ్ షేన్, కాన్ టే, వూ హెస్సేన్ అనే ముగ్గురు ఖగోళ శాస్త్ర వేత్తలు ఉత్తరోత్తరా వేలాది సంవత్సరాలకు ఉపయోగపడేలా వివరాలతో అద్భుతమైన నక్షత్రాల కేటలాగ్‌ను తయారు చేశారు. క్రీ.శ. 4వ శతాబ్దంలో ఈ క్యాటలాగ్ ఆధారంతోనే చెన్‌చో నక్షత్ర పటాన్ని రూపొందించాడు. నక్షత్రాల అట్లాస్‌లలో ఈనాటికీ ఉపయోగంలో ఉన్న నక్షత్రాల సమూహాన్ని సూచించే 'బాల్ అండ్ లింక్' పద్ధతిని చైనాదేశస్థులే మొదట ప్రారంభించారు.



## మన పరిసరాలు

### మిడతల 'దండం'



చిన్న చిన్న మొక్కల మీద ఎగిరే మిడతను మీరెప్పుడైనా పరిశీలనగా చూశారా? సన్నటి పుల్లల్లాంటి కాళ్ళతో పచ్చగా కనిపించే ఈ కీటకం మొక్క మీద వాలినప్పుడు ముందు కాళ్ళను పైకెత్తుకుని దండం పెడుతున్నట్టు కనిపిస్తుంది.చాలా తెలివైన ప్రమాదకరమైన కీటకం ఇది. చిన్న చిన్న పురుగులను పట్టి తినడంలో మహాదిట్ట.

మిడత ముందు కాళ్ళకు పదునైన సూదుల్లాంటి భాగాలుంటాయి. పురుగులను పట్టుకోవడానికి ఇవి బాగా ఉపయోగపడతాయి. చిన్న చిన్న కీటకాలను పట్టుకోవడంలో మిడత మహా నేర్పరి. అది శరీరాన్ని ఏమాత్రం కదిలించకుండా తలను పైకీ, కిందికీ, పక్కలకూ తిప్పి చూడగలదు. మిడత చిన్న కీటకాన్ని చూడగానే, మెల్లగా జాగ్రత్తగా అడుగు మీద అడుగు వేసుకుంటూ దాన్ని సమీపిస్తుంది. అది కాళ్ళకు అందే దూరంలో ఉందనగా ముందు కాళ్ళనుసాచి లబుక్కున పట్టేస్తుంది. అది కాళ్ళకున్న పదునైన సూదులలో చిక్కుకుపోతుంది. మిడత హాయిగా దాన్ని తినేస్తుంది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ANANTA PRABHAKARA DATTU

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మే 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018.

## అభినందనలు

జనవరి నెల పోటీ ఫలితాలు
పి.ఆర్.కె. చైతన్య
తం.పే. సురేష్ బాబు
కిడ్స్ రెడీమెడ్, కమాన్ బజార్
ఖమ్మం - 507 001
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : సూక్ష్మంగా పరిశీలిద్దాం!
రెండవ ఫోటో : ప్రయోగాలతో పురోగమిద్దాం!!

## సమాధానాలు :

1. ఒకరకం శాలువా. గొర్రె పిల్లల మెడ నుంచి తీసిన పాషిమ్ ఉన్నితో తయారు చేయడం వల్ల; 2. మొరాదాబాద్; 3. కాశ్మీర్; 4. బంగారం, వెండి, రాగి, సీసం, తగరం; 5. వారణాశి నుంచి.

**Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,** JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : B. Viswanatha Reddi (Viswam)**

# బాల్యం నుంచి మేము పెరిగింది
# ఆంధ్రాబ్యాంక్ యొక్క కిడ్డి బ్యాంక్ తో

ప్రస్తుతం మా పిల్లలు కూడా అలాగే పెరగాలని కోరుకుంటున్నాము.




ప్రత్యేకించి పిల్లల కోసం, పిల్లల ప్రత్యేక పొదుపు పథకం "ఎబి కిడ్డి బ్యాంక్" ను ఆంధ్రాబ్యాంక్ వారు పునఃప్రవేశపెడుతున్నారు.

ఈ పథకం ప్రత్యేకమైన బొమ్మతో పాటు అనేక ప్రత్యేకతలను కలిగియున్నది.

నేడే మీ పిల్లల కోసం ఈ ఖాతాని ప్రారంభించి, చిన్న వయస్సులోనే వారిలో పొదుపు అలవాట్లను నేర్పించండి.

ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक **ANDHRA BANK**

(భారత ప్రభుత్వ సంస్థ)

**Much more to do, with YOU in focus**

CHANDAMAMA (Telugu) March 2008 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08




# బుబ్బా సాహసాలు

ఈతకొలను వద్ద కోచ్ మహాకోపంగా కనిపించాడు.




కోచ్ ఈతకొలను చుట్టూ తిరుగుతున్నాడు. బుబ్బా డైవింగ్‌బోర్డ్ మీదికి వచ్చాడు.




బుబ్బా ఒక్కగెంతున ఎగిరి కొలను పక్కన కోచ్ ముందుకు ఉరికాడు.




కోచ్ మరో మాట మాట్లాడేలోపల, బుబ్బా అతని నోట్లో ఒక బుబ్బాలూ వేసి మూసేశాడు.




మరుక్షణమే, బుబ్బాలూ లోపలి జ్యూస్‌ను కోచ్ రుచి చూశాడు.



జ్యూస్ వెలుపలికి ప్రవహించడంతో కొలను లేత ఎరుపుగా మారిపోయింది. ఆ సుడుల మధ్య చిక్కుకున్న కోచ్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.



ఈతగాళ్ళు సుడులలో, అలలపై ఆనందంతో తేలియాడారు.






ఈతగాళ్ళకు బుబ్బాలూతో బుబ్బా సిద్ధమయ్యాడు.

